# ఆంధ్రపత్రిక

317224



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 213 SATURDAY 6th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# లాయక్ అలీ మంత్రివర్గ దుశ్చర్యల విచారణ

## భారతప్రభుత్వ నిర్ణయం కాగానే నైజాం అవసరమైన చర్య తీసుకోవచ్చు

### పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ సాక్ష్యము సేకరిస్తున్నట్లు సూచన

(స్వకీయ విలేఖరి)

హైదరాబాద్, నవంబరు 4 : భారతప్రభుత్వం, లాయకాలీ మంత్రివర్గమును విచారించవలెననియే అంతిమనిర్ణయం చేసినదని రూఢిగా తెలియుచున్నది. అయితే ఏ యే నేరాలక్రింద యీమంత్రివర్గ విచారణ జరుపవలెనన్న విషయమును భారతప్రభుత్వం ప్రస్తుతం ఆలోచించుచున్నది. హైదరాబాద్ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఏ. వి. పాత్రోగారు దీనికి అవసరమైన విషయములను సేకరించుచున్నారని తెలియుచున్నది.

సంస్థాన ధనమును దుర్వినియోగం చేయుట, హత్య, దోపిడీ, మొదలగు అత్యాచారములను ప్రోత్సహించుట, మొదలైన నేరములక్రింద లాయకాలీ మంత్రివర్గం విచారింపబడునని తెలియుచున్నది. ప్రధానమంత్రికి 20 వేల రూపాయలకు మించి మంజూరుచేయు అధికారం లేదట. అయితే ఆయుధములు, మందుగుండు సామాను మొదలైన యుద్ధ పరికరములను కొనుగోలు చేసిన విషయంలో ఖర్చుపెట్టిన పెద్దపెద్ద మొత్తములకు నవాబు అనుమతి పొందలేదుట. ఈ విచారణ జరుపుటకుగాను నిజాం నవాబు ఫెడరల్ కోర్టు న్యాయాధికారి, స్థానిక న్యాయాధికార్లతో కూడిన ఒక ప్రత్యేక న్యాయ నిర్ణయసంఘమును ఏర్పాటుచేయును.

## లాయకాలీపై అభియోగాలు

హైదరాబాదు, నవంబరు 4: ప్రస్తుతము తమతమ గృహములలోనే ఎరెస్టు కిందనున్న మాజీ ప్రధాని మీర్ లాయకాలీ, అతని అనుచరులపై అభియోగములు పూర్తిచేయబడుచున్నవి. ఈ అభియోగములలో ప్రభుత్వసొత్తు అపహరణ, దోపిడీలకు మద్దతు, ప్రభుత్వసొత్తు దుర్వినియోగము, 25 వేలుమించిన ప్రభుత్వఖర్చుకు నిజాము అనుమతి పొందవలెనను శాసనమును ఉల్లంఘించుట మొదలగు నేరములు కలవు. విచారణచేయుటకు ప్రత్యేక న్యాయస్థానము ఏర్పాటు చేయబడును. ఫెడరల్‌కోర్టు జడ్జీలలో ఒకరు ఈ న్యాయస్థానమున కధ్యక్షత వహించవచ్చును.

## ఉద్యోగుల బర్తరఫ్

నిజాం ప్రభుత్వ ప్లానింగుశాఖ కార్యదర్శి మహమ్మద్ యూనూస్, అభివృద్ధి శాఖాధికారి హుస్సేన్‌లను మిలటరీ ప్రభుత్వం బర్తరఫు చేసినది. వీరు తమ కప్పగించబడిన ధనంలో దాదాపు రెండులక్షల రూపాయలను దుర్వినియోగం చేసినారట.

## హైదరాబాద్‌లో ప్రత్యేక న్యాయనిర్ణయ సంఘాల ఏర్పాటు

### నూతన నిబంధన అమలు

హైదరాబాద్, నవంబరు 3 : సంస్థానంలో ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘములను ఏర్పాటు చేయుటకుగాను నిజాం నవాబు అనుమతితో ఒక ముఖ్యమైన నిబంధన అక్టోబరు 31 నుండి అమలుపర్చబడినది. ఇది ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘముల నిబంధన అని వ్యవహరింపబడుచున్నది.

ఈ నిబంధన ప్రకారం హైదరాబాద్ మిలిటరీ గవర్నరు, సంస్థాన మంతటా గాని, ఒక ప్రదేశంలో గాని, తాను నియమించిన ముగ్గురు సభ్యులతో ఒక న్యాయ నిర్ణయ సంఘమును ఏర్పాటు చేయవచ్చును. ఈ నిబంధన అమలు జరుపబడుటకు ముందుగాని తర్వాత గాని జరిగిన నేరములను ఒక ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘము విచారించ వలసిందిగా సాధారణ ఉత్తరువుల ద్వారాగాని, ప్రత్యేక ఉత్తరువుల ద్వారాగాని మిలిటరీ గవర్నరు ఆదేశించ వచ్చును. ఏరకపు నేరములనైనా గాని, లేక ఒక ప్రత్యేక నేరమును గాని ఒక ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘం నుండిగాని, క్రిమినల్ కోర్టు నుండిగాని వేరొక ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘమునకు మార్చవలసిందిగా కూడ మిలిటరీ గవర్నరు ఆదేశించవచ్చును. ఈ ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘం, ఏ నేరములనైనను, వేరొకరు ధృవీకరించవలసిన అవసరం లేకుండా తీర్మానము చేయవచ్చును.

ఈ ప్రత్యేక న్యాయ నిర్ణయసంఘం ఏ నేరములోనైనను (ఫలాని నేరమునకు ఫలాని విధానమును అనుసరించవలెనని యీ నిబంధన నిర్ణయించక పోవుటచే) తక్షణం విచారణ జరుపునేరముల విషయంలోను, వారంటుకేసుల విషయంలోను మాజిస్ట్రేట్లు అనుసరించు విధానమును అనుసరించవచ్చును. హైదరాబాద్ క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ కింద ప్రస్తుతం సంస్థానంలో సెషన్సు కోర్టులకున్న అధికారములన్నీ యీ ప్రత్యేక న్యాయనిర్ణయ సంఘమునకు ఉండును.

న్యాయశాస్త్రము ననుసరించి ఈ ప్రత్యేక న్యాయ నిర్ణయ సంఘం ఎటువంటి శిక్షనైనా విధించవచ్చును. ఈవిధంగా విధింపబడిన శిక్ష రెండు సంవత్సరముల ఖైదునుమించి ఉంటేయెడల, యీ ప్రత్యేక న్యాయనిర్ణయసంఘం ఆ నేరమునుగురించి తాను జరిపిన కార్యకలాపములను మిలిటరీ గవర్నరునకు సమర్పించవలెను. ఖైదు శిక్ష రెండు సంవత్సరములకు మించేయెడల, దానితోపాటు విధించబడిన యితర శిక్షలు రద్దుచేయబడును. ప్రత్యేక న్యాయ నిర్ణయసంఘం విధించిన శిక్షలను మిలిటరీ గవర్నరు పరిశీలించి అవసరమని భావించేయెడల వాటిని పెంచవచ్చును.

## స్టాలిన్, ట్రూమన్, అట్లీ క్వివిల్లీ సమావేశం సంభవమా?

లండన్, నవంబరు 4: అమెరికా అధ్యక్షపదవి ఎన్నికలలో, తలవని తలంపుగా, విస్మయకరంగా ట్రూమన్ అఖండ విజయంచేపట్టడంతో, అధ్యక్షుడు ట్రూమన్, బ్రిటిష్ ప్రధాని అట్లీ, ఫ్రెంచి ప్రధాని క్వివిల్లీగారలు, మార్షల్ స్టాలిన్‌ను కలుసుకొనుట సంభవమని, కడచిన రాత్రి లండన్ పారిస్ నగరములలో వదంతులు వ్యాపించినవి. "డెయిలీ ఎక్స్‌ప్రెస్" రాజకీయ విలేఖరి ఈ వదంతులపై యిట్లు వ్యాఖ్యానించెను. "యీ నల్గురు నాయకుల సమావేశమునకు యింతవరకు నిర్దుష్టముగా ఎట్టి యేర్పాట్లు జరుగలేదని, అయితే, అగ్రరాజ్యములు తమ విభేదములను తొలగించుకొని వీలైనంత త్వరగా జర్మన్ జపాన్ సంధి ఒడంబడికలను తయారుచేయవలెనని కోరుచూ నేడు ఐక్యరాజ్య సమితి సమావేశంలో ప్రతిపాదింపబడిన తీర్మానమునకు, పశ్చిమరాజ్యములు రష్యా, కలసి అనుకూలముగా ఓటుచేసినవని తెలిపెను."

(గ్లోబ్)

## 'మధ్యప్రాచ్య ఆగ్నేయాసియాల మధ్యసుహృద్భావం వృద్ధిపొందాలి'

### ప్రపంచవ్యవహారాల్లో ప్రాచ్యప్రపంచ ప్రాధాన్యాన్ని వివరిస్తూ కైరోలో నెహ్రూ ప్రకటన

కయిరో, నవంబరు 4 : "ప్రస్తుతము ప్రపంచము నెదుర్కొనుచున్న విషమ పరిస్థితులు యుద్ధమునకు దారి తీయకపోవచ్చును. అయినప్పటికీ, అంతటా శాంతి శక్తులు ప్రబలముగా నున్నవి. ఇంతలో యుద్ధము వచ్చునని నేను భావించను. యూరపులోని రెండు సమూహముల వారును యుద్ధోన్ముఖులు కారు. ఇది ప్రజల కత్యంత శ్రేయస్కరము. ఈ లోపుగా ప్రపంచశాంతికి అనర్థకములైన సమస్యలను ఐక్యరాజ్యసమితి తప్పక పరిష్కరించును. ఆసియా తోడ్పాటులేక ప్రపంచసమస్యలు పరిష్కరించబడవు." అని కయిరో పత్రికా విలేఖరులతో పండిట్ నెహ్రూ చెప్పెను. ఇండొనీషియాలో "సామ్రాజ్యవాదులు" ఇంకను దౌర్జన్యము సాగించినచో ఇండియాలోనూ, ప్రపంచములోనూ కూడా దుష్ఫలితములు కలుగగలవని ఆయన హెచ్చరించుచు, అక్కడ వలసరాజ్య సామ్రాజ్య విధానములు పూర్తిగా నిర్మూలము కావలెనని చెప్పెను. ప్రాచ్యదేశ ప్రజానీకములును, వారి నాయకులును ఒకరి నొకరు కలిసికొని పరిచయము చేసుకొనవలెనని చెప్పుచు, "మన ముందున్న మహత్తర కార్యమును సాధించగలుగుట కొరకు మధ్యప్రాచ్యము వారికినీ ఆగ్నేయ ఆసియావారికిని మధ్య సుహృద్భావములు బలపడగలవని ఆశించుచున్నాను" అని నెహ్రూ పలికెను.

బ్రిటనుతోనూ, కామన్వెల్తు రాజ్యములతోనూ ఇండియా సహకరించుటకు, రాజ్యాంగ ముసాయిదాలో చేర్చిన సర్వస్వతంత్ర రిపబ్లిక్ సూత్రము అడ్డురాదని ఆయన వివరించెను.

పారిస్‌నుండి విమానముపై ఇక్కడికి నేడు వచ్చియున్న పండిట్ నెహ్రూ, అరబ్ లీగ్ ప్రధానకార్యదర్శినీ, ఐక్యరాజ్యసమితి ప్రతినిధినీ తదితరులనూ సందర్శించు కార్యక్రమము ఏర్పాటు చేసికొనెను. ఆయన అరబ్‌లీగ్ అతిథిగా, లియాకతాలీఖాన్ ఉన్న సెమిరామిస్ హోటలులోనే బస చేసెను. నేటిరాత్రి అరబ్‌లీగ్‌వారు ఇండియా పాకిస్థాను ప్రధానులకు కలిపి విందు చేయుచున్నారు. కయిరోలో నెహ్రూ ఫరూకురాజును కూడ సందర్శించెను. రేపు నెహ్రూ లియాకతాలీఖాన్‌గార్లు గృహోన్ముఖులు కాగలరు.

## అయిక్యరాజ్యసమితి ఉండడమే ఉత్కృష్ట విషయం

ఇండియా ప్రధాని, పండిట్ నెహ్రూ ఈజిప్టు ముఖ్యనగరమైన కయిరోలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు ఐక్యరాజ్యసమితియనేసంస్థ ఒకటి ఉండడమే చాలా గొప్ప విషయమని చెప్పెను.

(5-వ పేజీ చూడుడు)

## బర్మాలో కమ్యూనిస్టు తిరుగుబాటు

### పాంగ్డే పట్టణములోనికి తిరుగుబాటుదార్ల ప్రవేశము

రంగూన్, నవంబరు 4: బర్మాకు తిరుగుబాటుదార్లు నేడు యిచ్చటికి 180 మైళ్ల ఉత్తరమున థరవాడిజిల్లాయందలి పాంగ్డేపట్టణములోనికి ప్రవేశించిరని ప్రభుత్వప్రకటన యొకటి తెలిపెను, నగర మధ్య భాగమున బజారుప్రాంతములో వారు స్థావరము లేర్పరుచుకొనిరి. ఈప్రాంతము నింకను ప్రభుత్వ సైనికులు రక్షించుచున్నారు. ఈపట్టణమునకును చుట్టుపట్లనున్న పట్టణములకును టెలిఫోను సంబంధములు తెగిపోయినవి. ఈపట్టణమునందలి ప్రభుత్వ సేనల సహాయార్థము ఆయుధశకటములు, పదాతిదళము వెళ్ళుచున్నవి. మండలే పశ్చిమమున షెబొజిల్లాలో మరి రెండు సంఘర్షణలు జరిగెనని, ఈసంఘర్షణలలో 14 మంది తిరుగుబాటుదార్లు హతులైరని ప్రభుత్వ ప్రకటన తెలిపెను.

అ. ప్రె.

## తిరువాన్‌కూరు తమిళప్రాంతాన్ని మద్రాస్‌లో కలుపుకృషి

### సత్యాగ్రహము ప్రారంభింప నిర్ణయము

నాగర్‌కోయిల్, నవంబరు 4:—తిరువాన్‌కూరు తమిళప్రాంతమును మద్రాసు రాష్ట్రమునందలి తమిళ ప్రాంతములతో కలిపి వేయుటకుగాను 30 రోజుల లోపుగా సత్యాగ్రహము ప్రారంభింప తిరువాన్‌కూరు తమిళనాడు కాంగ్రెస్‌వారు నిశ్చయించియున్నారు. తిరువాన్‌కూరు తమిళనాడు కాంగ్రెస్ కార్యవర్గమును రద్దు చేసిన "థేనియస్" నాయకత్వమున ఒక కార్యాచరణసంఘము నేర్పరుప కార్యవర్గమువారు నేడు నిశ్చయించిరి.

అ. ప్రె.

## అమెరికాలో గాంధీ స్మారక వస్తుప్రదర్శనశాల

న్యూయార్కు, నవంబరు 4: అమెరికా శాసనసభ్యులైన ఎమ్మాన్యుయల్ సెల్లరు గారు నేటిరాత్రి రాయిటరు ప్రతినిధితో మాట్లాడుచు ఇట్లు చెప్పిరి.

గాంధిమహాత్ముని సంస్మరణార్థముగా అమెరికాలో వాషింగటను నగరమందు ఒక వస్తు ప్రదర్శనశాలను అమెరికమప్రజా చందాలతో నిర్మించవలెనని ఒకపథకమును అమెరికను శాసనసభలో ప్రతిపాదించెదను. అట్టి ప్రదర్శనశాల భారతదేశానికి, అమెరికాకు పరస్పర విజ్ఞాన సన్నివేశరంగముగా నుండగలదు.

## ఇండొనీసియా భవిష్యత్తును తేల్చివేసే సంప్రతింపుల ప్రారంభం

### జోగ్జకర్తావద్ద డచ్చి విదేశమంత్రి సిక్కర్‌తో రిపబ్లికన్ ప్రధాని హట్టా చర్చలు

బటేవియా, నవంబరు 4: ఇండొనీసియాలో యుద్ధపరిస్థితే ఏర్పడుతుందో, లేక శాంతిస్థాపనే జరుగుతుందో తేల్చివేసే అతి ప్రధానమైన సంప్రతింపులు డచ్చి విదేశమంత్రి స్టిక్కర్‌కు, రిపబ్లికన్ ప్రధాని డా॥ మహమ్మద్ హట్టాకు మధ్య నేడు ప్రారంభమైనవి. ఇండొనీసియా భవిష్యత్తును నిర్ణయించే ఈ చరిత్రాత్మక సంభాషణలు రిపబ్లికన్ రాజధాని జోగ్జకర్తా సమీపమునవున్న కాలియూరాంగ్ పట్టణములో సాగుచున్నవి. డచ్చిమంత్రి స్టిక్కర్ విమానములో నేడు రిపబ్లికన్ రాజధానికి వచ్చెను.

సంప్రతింపులలో సామరస్యంతో ఒప్పందం కుదరకపోతే, డచ్చివారు తిరిగి సైనికచర్యలకు ఉపక్రమిస్తారని భావింపబడుచున్నది. ఇండొనీసియా అఖరు డచ్చి గవర్నర్ జనరల్ వాన్‌మూక్‌కు వీడ్కోలు ఇచ్చుటకు వందలాది ఉద్యోగులు బటేవియా విమానాశ్రయమువద్ద నేడుహాజరైరి.

సర్ బెనెగల్ నరసింగరావు గారి అంతర్జాతీయపదవి

అయిక్యరాజ్య సమితి యొక్క అంతర్జాతీయ న్యాయశాస్త్ర కమిటీలో బెనెగల్ నరసింగరావుగారు సభ్యుడుగా 4-వ తేదీ అయిక్యరాజ్యసమితి సాధారణ సర్వసభ్య సమావేశమందు ఎన్నుకోబడిరి.

## కమ్యూనిస్టు నాయకునికి ఉరి

ఇండొనీసియా ప్రముఖ కమ్యూనిస్టు నాయకులలో ఒకడైన ఆలిమిన్‌ను నవంబరు 2 న ఉరితీసినట్లు రిపబ్లికన్ వార్తా సంస్థ 'అంతరా' ప్రకటించుచున్నది.

ఆలిమిన్ మధ్యజావాలోని సురకర్తా వద్ద జైలులోవుండగా గత మాసములో అరెస్టు చేయబడెను. మూసో అధ్వర్యమున ఇండొనీసియా కమ్యూనిస్టులు తూర్పు జావాలోని మాడియన్‌ను ఆక్రమించిన అనంతరమే ఆలిమిన్ ఖైదీగా చిక్కెను. ద్వితీయ ప్రపంచ సంగ్రామమునకు పూర్వము, మాస్కోలోను సంగ్రామ సమయమున మలయాలోను వుండెను. 1945 ఆఖరున ఇతడు ఇండొనీసియాకు వచ్చెను. మూసో ఆగస్టు 12 న వచ్చువరకు ఇతడే కమ్యూనిస్టులపై నాయకత్వము వహించెను. మూసో రణరంగములో ఇటీవల నిహతుడయినాడు.

## మూక్ ప్రయాణం

వాన్‌మూక్ నేడు సింగపూర్ చేరెను. ఇండొనీసియా వ్యవహారములలో అనుభవరహితులు ప్రవేశము కలిగించుకొనుచున్నారని ఇతడు ప్రకటించుచున్నాడు.

"సంపూర్ణ స్వపరిపాలనను స్థాపించుకొనుటకు పూర్వము ఇండొనీసియనులకు డచ్చివారి సహాయసహకారములు అవసరము. ఇండొనీసియా రిపబ్లిక్ చిన్న రాష్ట్రములుగా చీలి, మిగతా భాగములతో ఫెడరేషన్ను స్థాపించుకొనక గత్యంతరము లేదు. రిపబ్లికన్ ప్రధాని హట్టాకూడా ఫెడరల్ ప్రభుత్వానుకూల వాదియే," అని కూడ వాన్‌మూక్ సింగపూరులో అనెను.

## కలకత్తా నగరంలో టెలిఫోన్ సంబంధాల స్తంభింపచేయడానికి కుట్ర

కలకత్తా, నవంబర్ 4 :

కలకత్తా, కేంద్రటెలిఫోన్‌సంస్థ దగ్ధమై, నేటికి పది దినములైననూ కాలేదు. మరల నేడు 'బడ్జి-బడ్జి' టెలిఫోను సంబంధములు కోసివేయబడి, కలకత్తా పారిశ్రామిక ప్రాంతమంతయూ చాల ఇబ్బంది యేర్పడినది.

'బడ్జి-బడ్జి' వార్తా కేంద్రమునకు కలకత్తాతో గల సంబంధమంతయూ మొత్తముగా తెగిపోయినది. కలకత్తాకు 8 మైళ్ల దూరములో అలీపూర్ విమానకేంద్ర పరిసరములలో భూగర్భమునందున్న తంత్రులను నరికివేసినారు.

కలకత్తాలోని పారిశ్రామిక కేంద్రములన్నిటికిని 'బడ్జి-బడ్జి' క్రూడాయిలు, పెట్రోలు నిలువచేసుకొను ముఖ్య కేంద్రమైయున్నది.

ఆ తంత్రులు తీసివేయబడిన తావునకు, కలకత్తా టెలిఫోన్సు జనరల్ మానేజర్ ఆర్. సి. సెయిమ్‌గారును, ప్రస్తుతం కలకత్తా మకాములో నున్న తంతి తపాలా అభివృద్ధిశాఖ ప్రధానాధికారి కంజీలాల్ గారునూ వచ్చిరి.

ఇది విధ్వంసక చర్యయే కావచ్చునా యని ప్రశ్నింపగా సెయిమ్‌గారు, విధ్వంసక చర్యగాకాక, కేవలమూ ఆ తీగలను దొంగిలించుట వారి ఉద్దేశమైయున్న యెడల, వారికి కూలి గిట్టదే అనిరి.

టెలిఫోన్ సంబంధములను స్తంభింపజేయుదురుద్దేశముతో, ఒక నిర్ణీత కార్యక్రమము ప్రకారము సాగింపబడిన చర్య ఒక ప్రముఖ పోలీసుఉద్యోగి తెలుపుచున్నారు. పోలీసువారు దరియాప్తు చేయుచున్నారు. పశ్చిమ బెంగాలు ప్రధాని బి. సి. రాయ్‌గారు కూడ అచ్చటికి విచ్చేసి ఆ విధ్వంసక చర్యను తిలకించిరి.

అచ్చు కోసివేయబడిన తీగలు మొత్తం 14 జతలు ఇవి 'అమెరికన్‌గార్డ్'తో తొడుగువేయబడి భూగర్భము ఒక గజము లోతున నిక్షిప్తము చేయబడినవి. 24 గంటలలోపల మరల ఈ టెలిఫోను సంబంధములను పునరుద్ధరణ చేయుటకు తీవ్రముగా ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈ దినమే మరియొక ప్రమాదముకూడ జరిగినది. కలకత్తా టెలిఫోనుల, ఎక్కౌంటు డిపార్టుమెంటు ఆఫీసు భవనములో అగ్నిప్రమాదము జరిగినది. పై అంతస్థులలోనికి ఎక్కుటకుగల 'లిఫ్టు' తాలూకు ఎలెక్ట్రిక్ మోటారు నిప్పంటుకొని ఈ ప్రమాదము జరిగినట్లు చెప్పుచున్నారు. అగ్నిమాపక సహాయము వచ్చు లోపలనే మంట లార్పివేయబడినవి. అలీపూర్ విమాన కేంద్రము చేరువలో జరిగిన విధ్వంసక చర్యను తిలకించుటకు వెళ్ళిన ప్రముఖోద్యోగు లందరునూ ఈ వార్త తెలిసి ఇచ్చటికి వేరువిడి వచ్చిరి.

క్రిందటి వారము ధ్వంసమైపోయిన టెలిఫోను మార్గములలో, ప్రభుత్వభవనములు వగైరాలకు సంబంధించి నంతవరకూ ఒక 300 టెలిఫోను మార్గములు ఇంతవరకు పునరుద్ధరింపబడినవి.

లండన్, నవంబరు : రూర్ మండలము అంతర్జాతీయ ఆధిపత్యము క్రింద వుంచు సమస్యపై ఆరురాజ్యముల సమావేశము లండన్‌లో నవంబరు 11 న జరుగనుంది.

## చైనా రాజధాని ముట్టడికి కమ్యూనిస్టు సేనలవిపులసన్నాహం

### నాన్‌కింగుపైకి నాలుగుపటాలాల దండయాత్ర

లండన్, నవంబర్ 4: చైనా ప్రభుత్వ సేలను హతమార్చుటకు 11 కమ్యూనిస్టు సైన్యములు సిద్ధముగానున్నవి. మంచూరియాలో ఓడిపోయిన ప్రభుత్వసేనలు పారిపోవుటకు గల 2 మార్గములలోనూ ఒకటి, యింగ్‌కౌ, కమ్యూనిస్టుల వశమయ్యెను.

షాన్‌టాంగ్ రాష్ట్రపు సరిహద్దు నుండి కమ్యూనిస్టు సేనలు నాన్‌కింగుపై నిర్దిష్టమైన త్రివ్యూహములో వచ్చుచున్నవి. నాన్‌కింగ్ మీద తూర్పు పడమరల నుండి సేనలు ఒకసారి కమ్ముకొనును. ఈ సేనలకు నడుపుచున్నది జనరల్ చెన్‌యీ. పీపింగ్ హాంకౌ రైల్వేమీదుగా మరియొక కమ్యూనిస్టు సైన్యము తూర్పునకు వచ్చుచున్నది. పెంగ్పూ సమీపమున ఈ సేన ముందు చెప్పిన క్షేత్రవ్యూహమును కలిసికొనెను. ఈవ్యూహమును బలముగా యెదుర్కొనుటకుగాను ప్రభుత్వసేనలు నాన్కింగ్ పైభాగమునున్న ప్రదేశమును రక్షించుకొనుట నూనుదురట.

## ఇంకో రేవుపట్టణ పతనం

షాంగ్‌హై, నవంబర్ 5: మంచూరియాలో కోల్పోయినవిపోగా మిగిలిన రెండు రేవుపట్టణములలో ఒకటైన ఇంకౌను కూడా చైనాప్రభుత్వసేనలు ఖాళీచేసినట్లు చైనాప్రభుత్వవర్గములవారు నేడు అధికారరీత్యా అంగీకరించిరి. హులుటావ్ అనే రెండవ రేవుపట్టణమునుకూడా ప్రభుత్వసేనలు ఖాళీచేయుట ప్రారంభించినట్లు వార్తలు వచ్చుచున్నవి.

## 'కాశ్మీర్ విషయంతేలిపోతే పాకిస్థాన్ భారతదేశ ప్రాణమిత్రము కాగలదు'

### ప్రధానమంత్రి లియాఖత్ అలీఖాన్ అభిభాషణ

కెయిరో, నవంబరు 4 : పాకిస్థాను సమస్య పరిష్కారమైనప్పుడు పాకిస్థాన్, భారతదేశ ప్రాణమిత్రముగా నుండునని యిచ్చట పత్రికా ప్రతినిధులసభలో ప్రసంగించుచు పాకిస్థాను ప్రధాని లియాకతాలీఖాన్ గారు ప్రకటించిరి.

భారతదేశంతో పాకిస్థాను సంబంధముల విషయమై ప్రశ్నింపగా పాకిస్థానీలు భారతదేశముతో మిత్రభావమున నుండ గోరుచుండిరని లియాకతాలీగారనిరి. యిప్పుడు పరిష్కారం కావలసిన మిగిలియున్న సమస్య హైదరాబాదు కాదని, కాశ్మీరని ఆయన చెప్పుచు కాశ్మీరు సమస్యను పరిష్కారం చేయగలిగినది ఒక్క జనవాక్యమేనని చెప్పెను. తదనంతరము పాకిస్థాను భారతదేశ ప్రాణమిత్రముగా నుండుననిరి. ఐక్యరాజ్యసమితి శాంతిస్థాపనకు సమర్థమైన సాధనము కావలెనని ఆయన చెప్పెను. ఇస్లామిక్ యూనియనును లేదా ప్రాచ్యదేశముల కూటమిని యేర్పరుచుటకు పాకిస్థాను పూనుకొనునా యని యడుగగా ఐక్యరాజ్యసమితి ప్రణాళికకు లోబడి ప్రపంచమునందలి వివిధదేశములు సహకరించుట తన యభిమతమని, ఐక్యరాజ్యసమితి బలహీనముగా నుండుట వల్లనే చిన్న చిన్న జాతులవారు భద్రతకై కలియగోరుచున్నారని లియాకతాలీగారు చెప్పిరి.

కెయిరోలో తాను గావించిన సంభాషణల విషయమై పాకిస్థాను ప్రధాని యేమియు చెప్ప నిచ్చగింపలేదు. ఐకను, కెయి

(5-వ పేజీ చూడుడు)

నోటీసు

ఏలూరు సబ్ కోర్టులో

E. P. 48/1947.

(మదరాసు హైకోర్టు ఋణము C.S.54/1944) వాది (డిక్రీదారులు) కొచ్చిన్ గవర్నమెంటు Represented by its Chief Secretary. ప్రతివాదులు (తీర్పు ఋణస్థులు) సేటు రామాకంచ్ లాల్‌చంద్ వగైరా,

వాదికి రావలసిన యీ నెంబరు డిక్రీ బాకీనిమిత్తం... చేయబడిన ఆస్తులు ఏలూరు సబ్ కోర్టులో 18-11-48 తేదీని ఉదయము 11 గంటల లగాయతు వేలము వేయబడును.

(1) పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లి గూడెం తాలూకా కవకల్లు గ్రామములో R. S. No. 151 యం 12-12 ట్లు R. S. No 152 యం 25 25 ట్లులో నున్న... రైసుమిల్లు అను పేరుగల రైసు మిల్లులో... అందులో ఆవరణలోనున్న బిల్డింగ్సులోను... వడ్లమిల్లు... మిల్లు... భూమిలోనున్న... రామానందు లాల్‌చందు తాలూకు 2½ అణాల వాటా ఆస్తులు.

(2) పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకా తాడేపల్లిగూడెం గ్రామం తాలూకు R S No. 23/1 లోని యం 0.54 ట్లులో వున్న డాబా యిల్లు యితర కట్టడములు, అందుకు చేరియున్న... స్థలము... సేటు రామానంద లాల్‌చందు తాలూకు సగము వాటా ఆస్తులు.

వేలము... ఖరీదు చేయదలచినవారు... కోర్టులో హాజరై వేలము పాడుకొనవలెను. యితర వివరములు డిక్రీ హోల్డరు వకీలునుండి తెలుసుకొనవచ్చును.

ఏలూరు 2-11-48. | బి. రామగోపాలరావు, వాది తరఫు వకీలు,

# రాజ్యాంగముసాయిదాపైడిసెంబరు 9 నాటికి చర్చ ముగిసే అవకాశం

## పరిషత్‌సభలో రాజెన్‌బాబు వివరణ: క్లాజువారీ చర్చలతో కాలహరణం కూడదని హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబరు 4: భారత రాజ్యాంగ పరిషత్తు నేడు ఇక్కడ సమావేశమైనప్పుడు, సంస్థాన సమాఖ్యల ప్రతినిధుల సభ్యత్వం విషయమై శ్రీమతి దుర్గాబాయిగారు చేసిన ప్రతిపాదనపై జరిగిన చర్చలో పాల్గొనుచు, హెచ్. వి. కామత్‌గారు హైదరాబాదు, కాశ్మీర్, భోపాల్, పా... తూర్పు పంజాబు సమాఖ్యలు ఇప్పటికిన్నీ పరిషత్తులో యెందుకు ప్రాతినిధ్యం లేకుండా వుండవలెనో తనకు బోధపడుటలేదని చెప్పిరి. భారత రాజ్యాంగ పరిషత్తు తుది సమావేశంలో నైతం ఇవి యెందుకు పాల్గొనుటలేదని ప్రశ్నించిరి. కాశ్మీర్ ప్రాతినిధ్యం విషయమున చిక్కులు వున్నవను విషయమును గుర్తించితిననీ, హైద్రాబాదు సమస్య సుఖాంతముగ ముగిసినది కనుక సాధ్యమైనంత త్వరలో దాని ప్రతినిధులు హాజరైన యెడల సభ్యులు హర్షించెదరనీ, పరిషత్ నిబంధనావళిని అనుసరించి ప్రతినిధులను ఎన్నుకొనవలసినదనిగాని, నామినేట్ చేయవలసినదనిగాని హైద్రాబాదు సంస్థానాధీశుని ఆదేశించవలెనని కామత్‌గారు కోరిరి. ఈ సందర్భమున భోపాల్ విషయములో ఏ చిక్కులు ఏర్పడినవో తెలుసుకొనగోరుచున్నాననిరి. భారత రాజ్యాంగ పరిషత్తుకు ప్రతినిధులను యిక ఏ మాత్రము జాప్యముచేయకుండ పంపవలసినదని భోపాల్ అధికారులను ఆదేశించి తీరవలెనని సూచించుచున్నాను. "పాటియాలా తూర్పు పంజాబు సంస్థాన కూటమి విషయముకూడ అస్పష్టముగానే వున్నది. అచ్చటి పరిపాలనపైనా, సంస్థానాధీశునిపైనా అనేక ఆరోపణలు వినవచ్చుచున్నవి. తక్షణమే ప్రతినిధులను భారత ప్రజా పరిషత్తుకు పంపవలసినదని దీనికి ఆదేశించుట అవసరము" అని కామత్‌గారనిరి.

భారత రాజ్యాంగ పరిషత్తుకు సంస్థానాధీశులే కొందరు ప్రతినిధులను నామినేటుచేయు అధికారము రద్దుకావలెనని సిధ్వాగారు ప్రతిపాదించిన సవరణ విషయమై సభపై ఒత్తిడితేలేదు. నరేంద్రమండలి, రాజ్యాంగపరిషత్తు ఏర్పరచిన సంప్రతింపుల సంఘము కుదుర్చుకొన్న ఒప్పందమునకు ఈ సవరణ విరుద్ధము కాగలదని సిధ్వాగారు గ్రహించి మిన్నకుండిరి.

మయూర్భంజి సంస్థానమునకు ఇచ్చిన ప్రత్యేక ప్రాతినిధ్య సౌకర్యమును రద్దు చేయుట అవసరమని విశ్వనాధదాస్‌గారు ఒక సవరణను ప్రతిపాదించిరి. మిగత 28 సంస్థానములవలెనే మయూర్భంజి సంస్థానము కూడ ఒరిస్సా రాష్ట్రమునకలవగలదని యిదివరలో నిర్ణయింపబడినదని, ఈ సంస్థానమునకు ప్రత్యేకహోదా ఇచ్చినచో ఆ ప్రాంతమున చిక్కుకు దారితీయ గలదనికూడ దాస్‌గారు హెచ్చరించిరి.

మయూర్భంజి సంస్థానము ఒరిస్సా రాష్ట్రమున లీనము కానున్నదను నిర్ణయమును ఇప్పటివరకు భారతప్రభుత్వ సంస్థానశాఖ రాజ్యాంగ పరిషత్తుకు అధికార పూర్వకముగ అందజేయలేదని సభాపతి డా॥ రాజేంద్ర ప్రసాద్‌గారు వివరించిరి. ఈ నిర్ణయము అందినప్పుడు, ఏ విధమైన ఇబ్బందీ లేకుండగనే రాజ్యాంగ పరిషత్తు కావలసిన సవరణ నిస్సందేహముగ చేర్చబడగలదనికూడ రాజెన్‌బాబు బదులుచెప్పిరి. అంతట విశ్వనాధదాస్‌గారు తమ సవరణ విషయమును పట్టుదల చూపక విరమించిరి.

సంస్థానములుగాని, సంస్థాన సమాఖ్యలుగాని, తమ ప్రతినిధులను రాజ్యాంగ పరిషత్తుకు పంపవలసి వచ్చినప్పుడు ప్రస్తుతము ఆయా సంస్థానాధీశులను సంబోధించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపు పద్ధతిని నిలిపివేయవలెనని నాగప్పగారు కోరిరి. 1947, ఆగస్టు 15 అనంతరము సంస్థానాధీశులకు ఏవిధమైన అధికారములు మిగలలేదని, అధికారము యావత్తూ ప్రజల పరమైనదనీ, అధికారములేని వ్యక్తిని పరిషత్తుకు ప్రతినిధులను పంపవలసినదని కోరుటలో అర్థము లేదనీ కూడా నాగప్పగారు విమర్శించిరి. ఆయా సంస్థానముల శాసన సభాసభ్యులుగాని, ప్రజానులుగాని, ఎన్నికద్వారా అధికారమునకు వచ్చిన ఇతర ప్రతినిధులుగాని పరిషత్తు ప్రతినిధులను ఎన్నుకొనునట్లు చేయవలెననికూడ నాగప్పగారు సూచించిరి.

పరిషత్తు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు బదులుచెప్పుచు, ఏ సంస్థలకైతే హక్కువున్నదో ఆ సంస్థలచేతనే పరిషత్తుకు ప్రతినిధులను ఎన్నుకొనునట్లు చేయుటకే సంస్థానాధీశులను కోరడమువున్నది. ఈ విషయమున సంస్థానాధీశుడు ఏ విధముగను అడ్డుపడుటలేదని తెలియజేసిరి.

నాగప్ప: నేను చెప్పుచున్న విషయము కూడ సరిగా అదే. సంస్థానాధీశునకు ఏ విధమైన ప్రమేయమూ లేనియెడల, ప్రతినిధులనుఎన్నుకొనవలసినదని అట్టివ్యక్తికి వ్రాసి ప్రయోజనమేమిటి? వాస్తవాధికారము ప్రజలదే.

సభాపతి: భారతప్రభుత్వము సైతము గవర్నర్ జనరల్ పేరుతో అనేకపనులను నిర్వహించుచుండును. ఈ చర్చ అనంతరము శ్రీమతి దుర్గాబాయిగారి ప్రతిపాదనను సభ ఆమోదించెను. "88వ నిబంధన ప్రకారము ఏదైనా బిల్లును అసెంబ్లీ ఆమోదించినప్పుడు, అధ్యక్షుడు తన సంతకము ద్వారా సమ్మతి తెలిపి, దానికి శాసనహోదాను ఇవ్వవలెను. అంతట దానిని ఇండియా గెజెటులో ప్రకటించవలెను." అనునది ఈ ప్రతిపాదన.

### రాజ్యాంగ ముసాయిదా చర్చ: రాజెన్‌బాబు వివరణ

భారత రాజ్యాంగపు ముసాయిదాపై చర్చకు తాననుసరించదలచిన విధానమును సభాపతి రాజేంద్రప్రసాద్‌గారు వివరించిరి.

"భారత రాజ్యాంగపు ముసాయిదా దాదాపు ఎనిమిదినెలలక్రితమే సభ్యులందరికి పంచిపెట్టబడినది. ఏవైన సూచనలను, సవరణలను చేయదలచిన పంపవలసినదని కూడ సభ్యులను కోరితిమి. ఒక్క సభ్యుల వద్దనుండేగాక దేశములో నలుమూలల వున్న ప్రజాసంస్థలవద్దనుండికూడ అసంఖ్యాకముగ సవరణలు వచ్చినవి. రాజ్యాంగ రచనా సంఘము వీటన్నిటిని పరిశీలించి, ఈ సూచనలప్రకారం అనేక సవరణలను సైతం చేసినది. మొదట అందజేసిన ముసాయిదా మాత్రమేగాక రచనా సంఘం కొత్త సవరణలను చేర్చి తయారుచేసిన ప్రతికూడ ఇప్పుడు సభ్యుల ఎదుట వున్నది" అని సభాపతి రాజేంద్రప్రసాద్ అనిరి.

తాను సూచించు విధానము సభాసదులకు అంగీకారయోగ్యమయేపక్షమున ఈ ఆదివారము సాయంత్రము 6 గంటలవరకు నూతన సవరణలను అందజేయుటకు గడువు పెట్టెదరనికూడ రాజెన్‌బాబు చెప్పెను.

వయోజన వోటింగుపద్ధతిపైన మత సంబంధ ప్రాతినిధ్యరహితముగ నూతన శాసనసభ ఏర్పడువరకు భారత రాజ్యాంగపు ముసాయిదాపై చర్చను వాయిదా వేయవలెనని సూచించుచు ఒక సవరణ వచ్చినదని డా॥ రాజేంద్రప్రసాద్ సభ్యులకు తెలిపిరి. "గత రెండు సంవత్సరములుగ పనిచేయుచున్న కృషి అంతటినీ త్రోసి రాజనుటకు సభ్యులు ఇష్టపడెదరో లేదో నాకు తెలియదు. రాజ్యాంగము అమలులోనికివచ్చిన తొలి సంవత్సరములలో ఏ సవరణ అయినను సులభముగా చేయుటకు వీలుగ రాజ్యాంగపు ముసాయిదాలోనే ఒక క్లాజు వున్నందున ఇట్టి సవరణ అగత్యమేకాదు. వయోజన వోటింగుపద్ధతికి శాసనబద్ధముగ అనుమతి ఇచ్చునది ఈ రాజ్యాంగ ముసాయిదాయే. ఈ ముసాయిదాను ఆమోదించినప్పుడుమాత్రమే వయోజన వోటింగుపద్ధతి అమలులోకి రాగలదు."

ముసాయిదాను చర్చించుటలో సభ్యులకు సంపూర్ణ స్వేచ్ఛ ఇచ్చుటే తన ఉద్దేశ్యమనీ, అయినను సభ అనవసరముగ కాలమును వృథాచేయరాదనీ, ఎంత శ్రద్ధ వహించి అవసరమో అంతే తీసుకొనవలెనని సభ్యులు దీర్ఘ చర్చానంతరం ఆమోదించిన రాజ్యాంగసూత్రములే నిర్దిష్ట రూపంలో పొందుపరచబడినవనీ, అదే సూత్రములపై పునఃపరిశీలనను సభ్యులు కోరరని ఆశించుచున్నాననికూడా రాజేంద్రప్రసాద్‌గారు నుడివిరి. అక్కడక్కడ కొన్ని అంశములపై పునఃపరిశీలన అవసరముకావచ్చుననీ, కొత్తఅంశములను చర్చించవచ్చుననీ చెప్పిరి. పరిషత్తు సభ్యులు ఈ పద్ధతిని స్వీకరించినచో, 1948, డిసెంబరు 9 తేదీ నాటికి - రాజ్యాంగపరిషత్ ఏర్పడిన ద్వితీయ వార్షికదినోత్సవం - ముసాయిదాపై చర్చ పూర్తికాగలదనీ, పిమ్మట సభను రచనాసంఘం ముసాయిదాలో సభ్యులామోదించిన మార్పు అంశములను చేర్చుటకు వీలుగా కొన్నిరోజుల పాటు వాయిదా వేయవచ్చుననీ రాజెన్‌బాబు సూచించిరి. పది లేక 15 రోజుల అనంతరం తిరిగి సమావేశమై రాజ్యాంగమును ఆమోదించవచ్చుననిరి.

రాజేంద్రప్రసాద్‌గారు ఈ విషయము చెప్పగనే, జాతీయ భాషా సమస్యపై పరిషత్తు ఇక చర్చించవలెనని కొందరు సభ్యులు కోరిరి. రాజ్యాంగమును హిందీభాషలోనే ఆమోదించుట జరుగగలదని లోగడ రాజేంద్రప్రసాద్‌గారు చేసిన వాగ్దానమును జ్ఞప్తికితెచ్చిరి. రాజ్యాంగమును క్లాజువారీగా చర్చించుటకు పూర్వము జాతీయభాషా సమస్యపైని, లిపి సమస్యపైనా చర్చజరుపుట అవసరమని బాలకృష్ణ శర్మగారనిరి.

రాజ్యాంగపు ముసాయిదా హిందీ, ఉర్దు, హిందూస్థానీ భాషలలో గ్రంథరూపమున వెలువడినవనీ, జాతీయభాషా సమస్య తేలగనే, దానిలోనికి భాషాంతరీకరణను చేయుటకు ఒక కమిటీ ఏర్పడగలదనీ రాజెన్‌బాబు సమాధానము చెప్పెను. ఆంగ్లప్రతిని ఆమోదించుట జరుగగానే, జాతీయ భాషలలోనికి దీనిని సక్రమముగ అనువదించు ఏర్పాట్లు జరుగ గలవనిరి.

రాజ్యాంగము ప్రతిపౌరుడికీ అర్థముకాగలిగినంతటి సులభభాషలో వుండవలెననీ, దేశములోని ఇతర ప్రధాన భాషలలోనికి సైతము రాజ్యాంగమును అనువదించుట అవసరమని మజుందార్‌గారు సూచించిరి. చర్చ మరికొంత జరిగినపిమ్మట డా॥ అంబేద్కర్‌గారు రాజ్యాంగపు ముసాయిదాను సభలో ప్రతిపాదించిరి.

ఈ పరిషత్తు వయోజన వోటింగుపద్ధతిపై ఏర్పడినదికాదు. కనుక రాజ్యాంగమును ఆమోదించు హక్కు దానికిలేదని మౌలానా హజరత్ మోహానీగారు సవరణ ప్రతిపాదించిరి. అంతట సభ గురువారం ఉదయమునకు వాయిదాపడెను.

### అంబేడ్కర్ వివరణ

రాజ్యాంగరచనా సంఘ అధ్యక్షుడు డా॥ అంబేడ్కర్ రాజ్యాంగ ముసాయిదాను ప్రతిపాదించుచు అందలి ప్రధాన లక్షణముల వివరించిరి. వీరి ప్రసంగం చాలా భాగం నిన్నటి పత్రికలో ప్రకటింపబడినది. మిగతాభాగ మిచట ప్రచురించబడినది.

#### ప్రాతిపదిక హక్కులు

ప్రజలందరికి ఉండవలసిన ప్రాతిపదిక సార్వజనిక హక్కులు 13సెక్షనులో నిర్వచింపబడెను. ఈ సార్వజనిక హక్కులను ఏ విధముగా కాపాడవలెనో భారత శాసన సభకు సూచన పూర్వకముగా కొన్ని అంశములను యీ రాజ్యాంగ చట్టములో నిర్వచించితిమి. ఐర్లండు రాజ్యాంగ చట్టములో కూడా అట్టి సూచనలు కొన్ని చేయబడినవి. గవర్నరులున్ను గవర్నరు జనరలున్ను తమ అధికారములను ఏ రీతిగా చలాయించవలెనో వారికి సూచించుటకై ఉపదేశపత్రములు వారికి యివ్వబడవలెనని, 1935 సం॥ ఇండియా ఆక్టులో బ్రిటిషు గవర్నమెంటు నిర్ణయించెను. అదేరీతిగా యీ రాజ్యాంగ విధానము ప్రకారముగా శాసనసభకున్ను ప్రభుత్వకార్యకర్తలకున్ను యివ్వబడిన ఉపదేశములివి. శాసనసభలలో ఏదో ఒక పార్టీకి సంఖ్యాప్రాబల్య మేర్పడవచ్చును. ఏ పార్టీవారు అధికారంలోనికి వచ్చినప్పటికి సార్వజనికములైన హక్కులను భంగపరచుటకై పూనుకొని చట్టములను శాసింపవీలు లేదు. అట్టిపని చేసినందుకు న్యాయసభలో నేర విచారణ జరుగకపోవచ్చును. కాని, అట్టి సార్వజనిక హక్కులను భంగపరచినందుకు ఎన్నికల కాలములో వారు ప్రజలకు జవాబు చెప్పవలసినవారగుదురు. ప్రజలహక్కు సంరక్షణకై ధర్మపక్షమునే అవలంబించిన పార్టీలవారు ప్రభుత్వాధికారమును వశపరచుకొన్నప్పుడు, యీ చట్టములోని ఉపదేశ పూర్వకములైన అంశముల ప్రయోజనము విశదము కాగలదు.

#### కేంద్ర ప్రభుత్వానికి యిచ్చిన అధికార పరిమితి

కేంద్రప్రభుత్వమునకు హెచ్చు అధికారము యీ చట్టములో కల్పింపబడెనని కొందరు ఆక్షేపించిరి. ఆధునిక ప్రపంచములో అధికారమును కేంద్రీకరించుట తప్పనిసరియగుచున్నది. కాని కేంద్రమునకు మించిన తలబరువు అధికారమును కూడా కల్పించకూడదు.

#### ఈ రాజ్యాంగ చట్టంలోని సమాఖ్య సముదాయోచిత స్వరూపం

ఈ రాజ్యాంగ చట్టంలోని సమాఖ్య ప్రభుత్వ పద్ధతి సముదాయోచిత సంస్కరణావకాశం కలది. ఇందులో న్యాయశాస్త్ర పదజాల ప్రతిబంధకములు లేవు. ఆస్ట్రేలియా రాజ్యాంగ విధానమునే అనుకరించితిమి. కాని, దానికంటె ఇది మిన్నగా రచింపబడినది. ఆస్ట్రేలియా పార్లమెంటుకు 3 వ్యవహార విషయములలో మాత్రమే రాష్ట్రాలపై అధికారంకలదు. కాని యీ భారతసమాఖ్య ప్రభుత్వానికి 91 విషయములలో అధికారమివ్వబడినది.

ఇతర రాజ్యాంగ విధానములలో నుంచి అనుకరణములు ఎక్కువగా చేయబడెనని కొందరు ఆక్షేపించిరి. కాని, యీరోజున కొత్తగా మనమున్ సృష్టిచేయదగిన రాజ్యాంగ సూత్రములే యున్నవి. 100 సంవత్సరముల క్రిందట మొట్టమొదటి సారిగా రాజ్యాంగ చట్టమొకటి లిఖితరూపంగా ఆధునిక ప్రపంచములో రచింపబడెను. దానితర్వాత అనేక దేశాలు రాజ్యాంగ చట్టమును తయారుచేసెను. వీని కన్నింటికి పోలికలు కలవు. వాటిలో ఉండే లోపములను సవరించి మన రాజ్యాంగచట్టమును మన దేశావసరమునకు కలిసినట్లుగా రచింపగల్గితిమి.

కేంద్రప్రభుత్వమునకు సంస్థానాలమీద సైనిక వ్యవహారమందును, విదేశాంగ వ్యవహారమందును, రహదారీల విషయములోను మాత్రమే అధికారము వహించుటకు అవకాశమున్నది. ఆయా సంస్థానములు తమ సొంతరాజ్యాంగ పరిషత్తులను ఏర్పాటుచేసుకొని సొంత రాజ్యాంగ విధానములను నిర్ణయించుకోవచ్చునని అవకాశమిచ్చుట చాలా అధ్వాన్నముగా నున్నది. వారికి రాజ్యాంగ విధానములకున్నూ ఇండియా రాజ్యాంగ విధానమునకున్నూ వ్యత్యాసము ఉండేయెడల ఈ వ్యత్యాసము దేశానికి ప్రమాదకరము. ఇండియా ప్రభుత్వానికిగల అధికారము కొన్నిచోట్ల చలాయించబడవచ్చుననియు, మరికొన్ని ప్రాంతాలలో చలాయింప వీలులేదనియు నిరోధించేయెడల దేశంలో యుద్ధముకూడా సంభవించగలదు. స్వదేశ సంస్థానాలు తమ సొంతసేనను కూడా ఉంచుకొనవచ్చునని యీ రాజ్యాంగచట్టము సాయిదాలో అవకాశమివ్వబడినది. ఇదియింకా ప్రమాదకరము. ఇందువల్ల దేశైకమత్యమునకే భంగముకలుగ గలదు. కేంద్రప్రభుత్వముకూల ద్రోయబడవచ్చును. రాజ్యాంగ పరిషత్తు చేసిన నిర్ణయములనే యీ రాజ్యాంగ రచనాకమిటీ అనువదింపవలసినది విధిలేక ఇట్టి అసంబద్ధ నిబంధనలను ఇందులో ఈ రాజ్యాంగ రచనా కమిటీకి యిష్టములేకపోయినను చేర్పవలసివచ్చెను. సంస్థానాలతరపు కమిటీయున్నూ రాజ్యాంగ పరిషత్తు తరపు కమిటీయున్నూ రాయబారాలు జరిపి వ్రాసికొన్న ఒడంబడికను రాజ్యాంగపరిషత్తు అప్పట్లో అనుసరించెను.

1870 సం॥లో జర్మనీ రాజ్యమందు 26 సామంతరాజుల మండలములు 3 మాత్రము ప్రజా పరిపాలిత మండలములు ఉండెను. అవి అన్ని క్రమేణ తొలగిపోయి జర్మనీఅంతా ఒక్కటే రాజ్యమయ్యెను. మనదేశంలో 15-8-47 తేది నాటికి 600 సంస్థానాలు వెలసియుండెను. కాని వాటిలో చాలా సంస్థానములు ఇండియా యూనియను ప్రభుత్వంలో చేరినవి. ఇంకా 20 లేక 30 సంస్థానాలు మాత్రమే విడిగా మిగిలియున్నవి. ఇన్ని సంస్థానాలు ఇంతవేగంగా యూనియనులో సమ్మేళనమగుట, చాలా ప్రశంసనీయము. మిగిలియున్న సంస్థానాలు కూడా యూనియనులో చేరవలెననియు రాష్ట్రములవలెనే అవికూడా యూనియను ఏలుబడిక్రింద నుండవలెననియు కోరుచు ఆ సంస్థానాధీశులకు విన్నవించుచున్నాను. యీ సంస్థానాలు కూడా యీ రాజ్యాంగచట్టము శాసనమయ్యేలోపుగా చేరగలవని తలంచుచున్నాను. అంతేగాక, సంస్థానాలకు రాష్ట్రాలకు గల ప్రతిపత్తిలో వ్యత్యాసము తొలగిపోగలదని నా నమ్మకము.

#### రాజ్యాంగ చట్ట సంస్కరణావకాశం

ఈ రాజ్యాంగచట్టమును ఉత్తరోత్తరా సవరించి మార్పుచేయుటకు విశేషమైన చిక్కులు కల్పించలేదు. రెండు ప్రత్యేక విషయములలో మాత్రము రాష్ట్రీయ ప్రభుత్వ శాసనసభలచే స్థిరపరచబడవలెననే నియమమొకటి ఏర్పరుపబడెను. మిగిలిన వ్యవహారములకు సంబంధించిన నిబంధనలన్నియు ఇండియా పార్లమెంటువల్లనే మార్పు చేయబడవచ్చును. మూడింట రెండువంతులమంది అంగీకరిస్తే మార్పు జరుగగలదు.

ఈ రాజ్యాంగచట్టమును తయారుచేసి శాసించెడి యీ రాజ్యాంగపరిషత్తులోనిసభ్యులు ప్రజలలో కొద్దిమందికి మాత్రమే వోటింగుహక్కున్న పరిస్థితిలో ప్రజా ప్రతినిధులుగా నున్నారు. ఇట్టి ప్రజాప్రతినిధి పరిషత్తులోని అధికసంఖ్యాకులు ఆమోదించుటవల్లనే ఈ రాజ్యాంగ చట్టం శాసింపబడనున్నది. అట్టి సందర్భంలో వయోజన వోటింగున్నూ సార్వజనిక వోటింగున్నూ ఏర్పడి ఎన్నుకోబడు ప్రజాప్రతినిధులుగల భవిష్యద్భారత పార్లమెంటు, యీ రాజ్యాంగ చట్టమును మార్పుచేయుటకు అర్హతకలదై యుండును.

### ఉద్యోగుల మార్పులు

శ్రీ పి. వెంకట్రమణి-చెంగల్పట్టు అడవుల డిప్యూటీ కన్సర్వేటర్‌ను, కడపకు మార్చిరి.

గుంటూరు అడిషనల్ ట్రెజరీ డిప్యూటీ కలెక్టర్ జనాబ్ అమీరాలి అహ్మదీని విశాఖపట్నం హెడ్ క్వార్టర్సు డిప్యూటీ కలెక్టర్‌గా, శ్రీ రామానుజదాసు నాయుడుస్థానే మార్చిరి.

విశాఖపట్నం జనరల్ డ్యూటీ డిప్యూటీ కలెక్టర్ జాకబ్‌గారిని, ఆవడి ఆహారపదార్థముల నిల్వల స్పెషల్ డిప్యూటీ కలెక్టర్‌గా శ్రీ రాజరత్నం స్థానే నియమించిరి.

శ్రీ రాజరత్నం చెన్నపట్నం రేవనింగ్ ఆఫీసరుగా నియమింపబడెను.

జనాబ్ సైయద్ మహబూబ్‌ను విశాఖ జిల్లా జనరల్ డ్యూటీ డిప్యూటీ కలెక్టర్‌గా వేసిరి.

టెండరు నోటీసు

ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

శుద్ధమైన సన్న కాచిన నెయ్యి, బెల్లము సప్లయిచేయుటకు టెండర్లు

ఎం. & ఎస్. ఎం. రైల్వే గ్రెయిన్ షాపులకు శుద్ధమైన సన్న కాచిన నెయ్యి, బెల్లము సప్లయి చేయుటకు దిగువ వివరముగా సూపర్ స్క్రైబ్ చేసిన, సీల్డు కవర్లలో విడివిడిగా టెండర్లు కోరబడుచున్నవి. అవి 15-11-48 తేది సాయంత్రము 3 గంటలవరకు డిప్యూటీ జనరల్ మేనేజరు (జి. ఎస్.) గారిచే తీసుకొనబడును.

| సరుకు. | టెండరుమీద సూపర్ స్క్రైబు చేయవలసినది |
|---|---|
| శుద్ధమైన సన్నకాచిన నెయ్యి- | "GS/OR/181/48/XV Tender for Ghee" |
| బెల్లము - | "GS/OR/82/XVII. Tender for Jaggery." |

టెండర్లు నిర్ణీత ఫారములో ఒకొక్కొక్క సరుకుకు విడివిడిగా పంపవలెను. టెండరు ఫారము ఖరీదు రు 1/- మద్రాసు, పోర్టు టవునులోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే పే-మాస్టరు అందు క్యాషియరునారికి మనియార్డరు ద్వారా గాని పోస్టల్ ఆర్డరు ద్వారా గాని చెల్లించవలెను. ఈ సొమ్ము వాపసు చేయబడదు.

టెండరు ఫారము క్రింద చెల్లించిన ఖరీదు పే-మాస్టరు అందు క్యాషియరుకు చేరిన తరువాత సప్లయికి సంబంధించిన షరతులు నిబంధనలతో సహా టెండరు ఫారములు పంపబడును.

Dy. General Manager, (G. S.)
Madras.
8-11-48.

## గంటల పంచాంగం

సర్వధారి నం కార్తీక శు పంచమి 1948 సం॥ నవంబరు 6 శనివారం

తి॥ పంచమి ఉ 6-27 పూషా రా 6-19 వర్జ్యం రా 2-58 ల4-42 కు.

శు॥ షష్ఠి నవంబరు 7 ఆదివారం తి॥ షష్ఠి ప 7-30 ఉషా రా 8-17 వర్జ్యం రా 12 41 ల 2-27 కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక శు॥ పంచమి శనివారం

## డా॥ అంబేద్కరు వివరణ

నూతన రాజ్యాంగ ముసాయిదాను, పరిషత్తులో ప్రతిపాదించుచు, డా॥ అంబేద్కరు చేసిన ఉపన్యాసము అతి సుబోధకముగ నున్నది. ముసాయిదా లక్షణములను, బహుశః ఆయనకన్న ఉత్తమముగ ఎవరు వివరింపగలిగి యుండెడి వారు కారు. రాజ్యాంగము అనునది రాజ్యమునకు సంబంధించినది. ఆ రాజ్య ప్రదేశమును ఏ పద్ధతిని పాలించవలెనను దానిని నిర్ణయించవలసినప్పుడే రాజ్యాంగ నిర్మాణ ప్రసక్తి రాగలదు. అనగా దేశమునకంతకు ఒకే పరిపాలన కేంద్రమున ఉండవలెనా లేక ఆ పరిపాలనను స్థానికముగను, కేంద్రముగను విభజించుటయూ అను ప్రశ్న రాగలదు. విభజింపబడినది ఫెడరలు విధానమని పేర్కొనబడుచున్నది. అలా కాక, సర్వాధికారము, కేంద్ర ప్రభుత్వ వశమందున్న, అది యూనిటరీ విధానమనబడుచున్నది. ఫెడరలు విధానములో కొంత అధికారము స్థానికముగ నుండి, మిగిలినది ఈ స్థానిక ప్రాంతములన్నీ చేర్చి ఏర్పడిన సమాఖ్యయందుండును.

భారత ముసాయిదా రాజ్యాంగము, ఫెడరలు విధానము ననుసరించే ఏర్పడినది, అదికాక మరొక పద్ధతి, భారత ప్రజకు, భారతస్థితికి అనుసరణీయమని, అంగీకారమని చెప్పుటకు వీలులేదు. ఫెడరలు విధానము అనుసరించవలెనని సర్వత్ర ఎపుడో అంగీకరింపబడినది. భారత దేశము సాంస్కృతిక ముగ ఏకదేశమైనను, రాష్ట్రములుగా ఎంచబడుచున్న ప్రాంతములు (వీటిని భాషాప్రయుక్తముగ పునర్నిర్మించవలసి యున్నది) ప్రత్యేక వ్యక్తిత్వమును కలిగియున్నవి. ఆ వ్యక్తిత్వమును నిలబెడుతూ, ఏకదేశమను భావమునకు స్వరూపమిచ్చుటకు, ఫెడరలు విధానమే శరణ్యము. రాష్ట్రములతో డుగ సంస్థానములు కూడ నున్నవి.

ఫెడరలు విధానమునందు రాష్ట్ర, కేంద్ర అధికారముల విభజన యున్నప్పటికీ ఒక్కొక్క సందర్భములో అది సాధారణముగా యూనిటరీ ప్రభుత్వముగ మారుచుండుట కద్దు. కొన్ని పరిస్థితులందు అలా మారుట అవసరముకూడ. ఆ అవసరమును దృష్టియందుంచుకొని మన రాజ్యాంగ ముసాయిదా తయారు చేయబడినది. అందువల్లనే "శాంతి సమయమునందు, ఫెడరలు పద్ధతిని, యుద్ధ సమయమునందు యూనిటరీ పద్ధతిని పనిచేయునట్లు ముసాయిదాను తయారు చేసితి" మని డా॥ అంబేద్కరుగారు చెప్పిరి. అన్ని దేశముల రాజ్యాంగముల మంచి లక్షణములను తీసికొంటిమని ఆయన చెప్పినదాని యందు అతిశయోక్తి లేదు. రిటిష్ కను విధానమును ఫ్రెంచి విధానమును రెంటిని సంపుటీకరించిరి. అమెరికను అధ్యక్షుడు ఆయన కార్యవర్గమువలె కాక, భారత సమాఖ్య అధ్యక్షుడు, మంత్రివర్గము శాసనసభ సభ్యులుగ నుందురు. ఇలా సమ్మేళన చేయుటలో మంత్రివర్గ స్థిరత్వ ప్రాధాన్యముకన్న మంత్రివర్గ బాధ్యతను ప్రాధాన్యముగ నెంచితిమని అంబేద్కరుగారు చెప్పిరి. మంత్రివర్గము శాసనసభకు బాధ్యత వహించుట ముఖ్యమనుట నిస్సందేహము.

రాష్ట్రములకు, సంస్థానములకు ఏవిషయమందు తారతమ్య మనునది లేక, సంస్థానములుకూడ రాష్ట్రముల స్థాయిలో నుండవలెనను ఆయన సూచన సర్వత్రా అంగీకరింపబడును. సమాఖ్యయందు అందరి భాగస్వాములకు ఒకే విధమైన అంతస్తు ఉండవలెను. అందువల్లనే రాష్ట్రములను, ముసాయిదా రాజ్యాంగమునందు స్టేట్సు అని పిలిచిరి. సంస్థానములు యూనియనుకు పరదేశవ్యవహారములు, రక్షణ, రాకపోకలేకాక రాష్ట్రములతో పాటు అన్ని విషయములను యూనియన్ ప్రభుత్వమునకు వశపరచవలసియున్నది. అన్నిటికన్న అభ్యంతరమైనది సంస్థానములు స్వంతసైన్యములు ఉంచుకొనుట. కాని, ప్రథమమున సంస్థానములను సమాఖ్యలోనికి తెచ్చుటకు అప్పటి పరిస్థితినిబట్టి వాటికి అంగీకరించవలసివచ్చినది. నూతన రాజ్యాంగము అంగీకరింపబడులోపల రాష్ట్రములకు, సంస్థానములకు గల తారతమ్యము అంతరించగలదని డా॥ అంబేద్కరుగారి సూచనబలపరచ అర్హమైనది. బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపించినమీదట, వాస్తవమునకు రాష్ట్రములకు సంస్థానములకు భేదమునునది లేదు. దేశమున కంతకు ఒకే పౌరహక్కు ఉండవలెనని ముసాయిదా రాజ్యాంగ సూచన మెచ్చదగినది.

అల్పసంఖ్యాకుల రక్షణగురించి అంబేద్కరుగారు చెప్పినది ఉచితముగనున్నది. ఆ విషయమున అదివరకు పరిషత్తు చేసిన నిర్ణయములు అన్నిపక్షముల ఆమోదమును పొందినవి. అయితే ముసాయిదా రాజ్యాంగము భారత ప్రాచీన సంప్రదాయము ననుసరించి, గ్రామ పంచాయితీ రాజ్య సిద్ధాంతముల మీద నిర్మింపబడలేదను విమర్శకు సమాధాన మిచ్చుటలో వాటియెడ (గ్రామపంచాయితీ రాజ్యములయెడ) చూపిన నిరసన భావము అనేకులకు రుచించక పోయిన స్వాభావికము అదేవిధముగ, పరిపాలనా నిబంధనలను రాజ్యాంగ ముసాయిదా యందు చొప్పించుటకు గల అవశ్యకతను వివరించుచూ భారత దేశము ప్రజాప్రభుత్వమునకు అనువైన క్షేత్రము కాదను వ్యాఖ్య తిరస్కార భావముతో చూడబడును. గ్రామపంచాయితీలు కేవలము స్థానిక స్వయంసమృద్ధికి, పోషకత్వమునకు ఉద్దేశింపబడినవిగాని, వాటికి సైనిక బాధ్యతలు లేవు. వాటియెడ వ్యామోహము చూపెడువారు సైతం దిన పరిపాలనయందు వికేంద్రీకరణ కోరుచున్నారు గాని అంతకుమించి కాదు. కేవలము దేశమంతటను స్వస్వతంత్రమైన పంచాయితీ రిపబ్లికులుగా విభజించమని కాదు. రాజ్యాంగమునకు పూని ఆధారముగా తీసికొనినప్పుడు అంతకన్న విస్తారమైనవాటిని తీసికొనుటకు అభ్యంతర ముండకూడదు. భారతప్రజ ప్రజాసిద్ధాంతములన్నియు గారవముగ అంగీకరింపగల అంశము కాదు. ప్రజా ప్రభుత్వమునకు సహనమనునది ప్రథమ లక్షణము. భారతీయులకన్న సహన భావము కలవారెవరు? నేడు పరిపాలనావిధానము సక్రమముగ లేకపోయిన దానికి మూలము పరపరిపాలన. ఆ ప్రభుత్వమునకు, ప్రజకు సంబంధము లేకపోవుట, ప్రజకు విద్య నేర్పకపోవుట ప్రధాన కారణములు. ఏ రాజ్యాంగ జయాపజయములు దానిని, నిర్వహించు వారినిబట్టి యుండునుగాని నిర్మాతలు ఎన్ని రక్షణలు నిబంధనలు ఏర్పరచినను ప్రయోజనముండదు. అయినా నిర్మాతలు స్వానుభవమునుబట్టి ఇతరుల అనుభవమును బట్టి రాజ్యాంగమును లోపరహితముగ చేయవలసియున్నది.

## నోబెల్ బహుమతులు

స్టాకుహోంలు, నవంబరు 4: 'కాస్మిక్' కిరణ ప్రసారముల విషయమున వారుచేసిన పరిశీలనకుగాను, బ్రిటన్‌లోని ప్రముఖ పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్త పి. యస్. బ్లాకెట్ గారికి, ఆ శాస్త్రరంగమునందు ప్రపంచములోనే 'నోబెల్' బహుమతి యొసంగబడెను.

స్వీడన్‌లోని ఉప్సల విశ్వ విద్యాలయమునకు చెందిన ప్రొఫెసర్, ఆర్నీ టెలియన్ గారికి రసాయనిక శాస్త్రమునందు 'నోబెల్' బహుమతి యొసంగబడినది. నారు, శ్వేతధాతువులోని కణములను కొలచు విధానమొకటి కనిపెట్టిరి.

వాఙ్మయమునకు సంబంధించిన, 'నోబెల్' బహుమతి సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత టి. యస్. ఇలియట్ గారికి ఒసంగబడినది.

ప్రొఫెసర్ పి. యస్. బ్లాకెట్‌గారు, పరమాణు పరిశోధనలందు, ప్రపంచవిఖ్యాతిని గడించినవారు. ఒక ఇటాలియన్ శాస్త్రవిజ్ఞాన పరిశోధకుని సహాయములో పరిశోధనలుసలిపి వారు 'పాసిట్రాన్' అను ప్రత్యేక ఎలక్ట్రానుయొక్క అస్థిత్వమును నిరూపించియున్నారు.

ఇక టిసెలియాస్ గారి పరిశోధనవల్ల, రక్తనాళములకు సంబంధించిన వ్యాధుల చికిత్సలో ఒక క్రొత్త దారిద్రొక్కుట కవకాశ మేర్పడనున్నదట. వారి అనవరతమున నిర్వహింపబడిన పరిశోధనలలో, దెబ్బలు మొదలగు వానివల్ల శిథిలమైన రక్త ప్రసరణములయందు, తిరిగి యధాతథముగా ఆశక్తులపానే పనిచేయుటకు రసాయనిక పద్ధతుల పై తయారుచేయబడిన కృత్రిమ శక్తులను కనుగొనినారట. పందదారపై క్రిమిజాలము ప్రయోగింప బడునప్పుడు ఏర్పడు గుజ్జునంటే పదార్థమునుండి ఈ శక్తులను 1944 సంవత్సరములో కనుగొనినారు.

## భారతదేశానికి అమెరికా ఆర్థిక సహాయం

న్యూయార్కు, నవంబరు 4: అమెరికా శాసనసభలో (దిగువ సభయందు ప్రజా ప్రతినిధుల సభలో) సభ్యులైన ఎమాన్యూయల్ సెల్లరుగారు భారతదేశ విషయమై అశాసన సభలో యెక్కువ శ్రద్ధ వహించు సభ్యులైయున్నారు. వీరు రాయిటరు ప్రతినిధితో నేడు యిట్లు చెప్పిరి. భారతదేశమునకు అమెరికా ప్రభుత్వము ఆర్థిక సహాయము చేయవలసినదిగా అమెరికను శాసనసభవారిని నేను కోరదలంచియున్నాను. ప్రాచ్య రాజ్యాలకు కూడా అమెరికా ఆపన్న యిచ్చి ప్రాచ్యరాజ్యాల ఆర్థిక పునర్నిర్మాణమునకు తోడ్పడవలసియున్నదని మార్షలు పథకములో నిర్ణయింపబడుచున్నది. గనుక, ఈ ప్రాచ్యరాజ్యాల కొరకైన ఆర్థిక సహాయపథకములో భారతదేశము కూడా చేర్చబడగలదు.

భారతదేశముతో అమెరికా ప్రభుత్వము తన స్నేహమును, వ్యాపారమును శాశ్వతముగా నుండునట్లు చేసుకొనుటకొరకు సంధిపత్రమును వ్రాసికొనవలెను అందుకొరకై నేను ప్రయత్నించుచున్నాను.

మదరాసు, నవంబరు 4: సెంటు తామసుమౌంటులో ఒక బొగ్గులారీ గాయకుల్లపైన ఏడ్వురు బస్తాలపై పండుకొన్న ముగ్గురు నిన్నరాత్రి చనిపోయిరి. లారీ ఆవడిలో బియ్యంబస్తాలు వేసుకొని, సాయంకాలకం పూర్ణం, పెరుంబూరు మరకమ్మనకై నిలచెను. ఇంతలో వానరాగ ఆక్కడ నిలచిపోయెను. డ్రయివరు లేని సమయంలో పండుకొనెను. లారీ స్వంతదారు, క్లీనరు, కూలివాడు బస్తాలపై టార్పాలిను కప్పుకొని పండుకొనిరి. ఉదయం డ్రయివరు వచ్చి, వారిని లేపినప్పటికి, చనిపోయియుండిరి. కోలు గ్యాసు వల్ల ఊపిరాడక చనిపోయిరని ఎంచబడినది.

## తుంగభద్రాప్రాజెక్టు నిర్మాణం

### నైజాం అధికారుల వైఖరి

హైదరాబాదు, నవంబరు 4.

హైదరాబాద్ మిలిటరీ ప్రభుత్వ పరిశ్రమల మంత్రి నవాబ్ జైన్‌యార్ జంగ్, చీఫ్ ఇంజనీరు శేషా కృష్ణమూర్తిగారలు డిల్లీలో జరిగిన తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం విషయమై చర్చలలో పాల్గొనిన పిదప నేడు హైదరాబాద్ వచ్చిరి. తుంగభద్ర డాము నిర్మాణం ఏకాధిపత్యంగా జరుగవలెనని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం పట్టుపట్టినట్లు తెలియుచున్నది. డాములో హైదరాబాదువైపు భాగమును, హైదరాబాద్ చీఫ్ ఇంజనీరు అధికారంలో నుండునట్లును, మద్రాసు రాష్ట్రం వైపు భాగము రాష్ట్ర ప్రభుత్వ అధికారంలో నుండునట్లును నిర్ణయించబడెను. డాము నిర్మాణానికిగాను కాంక్రీటు, సున్నం ఉపయోగించవలెనని, కాలువల ద్వారముల నిర్మాణానికి సిమెంటు, కాంక్రీటు ఉపయోగించవలెనని కూడ నిర్ణయింపబడెను.

## దేశముఖు రామచంద్రారెడ్డి నిర్బంధం

హైదరాబాద్, నవంబరు 5:

నల్గొండజిల్లాలో ప్రజా కంటకుడుగ పేరుపడ్డ దేశముఖు విసునూరు రామచంద్రారెడ్డిని, స్పెషల్ బ్రాంచి ఇన్‌స్పెక్టరు వెంకోబరావుగారు నిన్నను నిర్బంధమునందుంచిరి.

రామచంద్రారెడ్డి హైదరాబాద్ శాసనసభ సభ్యుడుగా ఉండి, హైదరాబాద్ స్వతంత్రముగా నుండవలెనను వాదమును బలపరచవలసినదిగా, ముస్‌లిమ్ ఇత్తెహాదుల్ అంజుమన్‌ను కోరుచు చాల ప్రకటనలు చేసెనని తెలియుచున్నది. ఇతడు రజాకార్ల మిత్రుడని పోయిన ప్రభుత్వ వాయూములో, రజ్వీకి యితనికి గల సంబంధమునుబట్టి, ఉర్దూ పత్రికలలో యితని ఫోటోలు తరచు ప్రచురింపబడుచుండెడివని, ఎంచుచున్నారు.

ఇతడు రైతులచే వెట్టిచేయించుకొని హింసించెనని చాల ఫిర్యాదులున్నవి. నల్గొండజిల్లాలో, ఇట్టి దేశముఖులుండుటయే కమ్యూనిస్టులు తల ఎత్తుటకు మూలకారణమనుట అతిశయోక్తికాదు. ఇట్టి వారి నిరంకుశత్వంలు, రైతులలో అసంతృప్తియే అచ్చట కమ్యూనిస్టుల నాయకత్వమున రైతుల తిరుగుబాటుకు కారణమైనవి. అప్పట్లో కాంగ్రెసు అయోమయావస్థలో ఉండుటకూడ కమ్యూనిస్టులకు తోడ్పడెను. సర్ మీర్జా ఇస్మాయిల్ ప్రధానికన్న పూర్వము, ఈ పద్ధతులు మార్చుకొనక పోతే శాసనరీత్యా అవసరమగు చర్యలు గైకొనబడునని ఆయన రామచంద్రారెడ్డిని హెచ్చరించెను.

రామచంద్రారెడ్డిని నిర్బంధంలో ఉంచిరను వార్త విని రైతులు పెద్దభారము తొలగినట్లు భావించిరి. అంతేకాక, ఈ సైనిక ప్రభుత్వము రజాకార్లనే కాక, వారిని బాపరచిన వారిని, వారికంటే ఎక్కువ దుర్మార్గులు, క్రూరులు అయిన వారిని కూడ శిక్షించుచున్న నమ్మకము ఈ చర్య మూలమున ప్రజలలో కలిగినది. రైతులకు న్యాయము జరుగునటులకు ఈ అరెస్టు పనిమీగ నున్నదని ఒకరైతు నాతో అనెను.

## బషీర్ అహమ్మద్ నిర్బంధం

భారతసేనలు సికిందరాబాదులో ప్రవేశించిన తర్వాత, సెప్టెంబరు 19-న కింగ్స్‌వేలో ఇద్దరు హిందువులకు మరణము సంభవించుట కారణమున అరెస్టుచేయబడిన బషీర్ అహమ్మద్‌ను నిన్న మేజస్ట్రేటుకోర్టులో హాజరుపరచిరి. మేజస్ట్రేటు అతని జైలులో నిర్బంధమునందుంచవలసినదని ఉత్తరువు చేసెను. నిందితుడు రామానుజాచారి అనే ఒక వృద్ధుణ్ణి, నరయ్య అనే అతనిని కాల్చిచంపెనని, ముగ్గురు హిందువులకు తుపాకి గుండుదెబ్బలు తగులుటకు బాధ్యుడని ఆరోపించబడినది.

## బార్టన్ స్కూలు ఉపాధ్యాయుల సమ్మె

సికిందరాబాదులోని సర్ విలియం బార్టన్ స్కూలు ఉపాధ్యాయులు నిన్న "స్ట్రైక్" సమ్మెచేసిరి. మేనేజిమెంటుకు చేసిన విజ్ఞప్తిలో వారు ఈ సంవత్సరం మే, సెప్టెంబరు, అక్టోబరు జీతములు ముట్టలేదని తెలిపిరి.

## సంస్థానంలో సెన్సార్‌షిప్‌లేదు

సికిందరాబాద్, నవం 3: హైదరాబాదునుండి పత్రికావార్తలు సెన్సారు చేయబడుచున్నవని పారిస్ పత్రికా విలేఖరుల సమావేశంలో సర్ జఫ్రుల్లాఖాన్ చేసిన ప్రకటనను యిక్కడి అధికార వర్గములు తీవ్రంగా ఖండించినవి. "సంస్థానంలో ఏవిధమైన సెన్సార్‌షిప్ లేదు. ఈవిషయం సంస్థానంలోనున్న విదేశ పత్రికా విలేఖరులకు, వార్తా సంస్థలకు బాగుగా తెలియును." అని ఆ వర్గములు చెప్పుచున్నవి.

# వయోజన వోటింగుతో ఏర్పడిన రాజ్యాంగపరిషత్తే కొత్త రాజ్యాంగాన్ని చర్చించవలెను

## సోషలిస్టు ప్రతినిధి సూచన

న్యూఢిల్లీ, నవంబరు 5: నూతన రాజ్యాంగ ముసాయిదాను చర్చించవలెనని భారత ప్రభుత్వ న్యాయశాఖామంత్రి డా॥ అంబేద్కర్ చేసిన ప్రతిపాదనపై భారత రాజ్యాంగపరిషత్తు నేడు చర్చను కొనసాగించినది. వయోజన వోటింగు పద్ధతిపై రాజ్యాంగపరిషత్తు నేర్పరచి దానిచేత నూతన రాజ్యాంగమును చర్చింపచేయుట అవసరమని రాజ్యాంగ పరిషత్సభ్యుడూ, సోషలిస్టు నాయకుడూ అయిన సేట్ దామోదర్ స్వరూప్ ఒక సవరణను ప్రతిపాదించెను.

ఆ సవరణ ఈ క్రిందివిధంగా ఉన్నది:

"ప్రస్తుత రాజ్యాంగపరిషత్తు వయోజన వోటింగు పద్ధతిపైన ఎన్నుకొనబడినది కానందున కనుకనూ, స్వతంత్ర భారత రాజ్యాంగము భారతదేశములోని ప్రజలందరియొక్క అభీష్టము ననుసరించి ఉండవలెను కనుకనూ, ఈ రాజ్యాంగ పరిషత్తును తాను భారత శాసనసభగా మాత్రమే వ్యవహరించుటకు నిశ్చయించి, రాజ్యాంగ ముసాయిదాను చర్చించి అవసరమైన మార్పులను చేయుటకై, వయోజనవోటింగు పద్ధతిపై ఎన్నికలు జరిపి నూతన రాజ్యాంగపరిషత్తును సమావేశపరచు సన్నాహములను చేయవలెనని తీర్మానించుచున్నది."

దామోదరస్వరూపుగారు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి:

ఈ రాజ్యాంగ పరిషత్తులోని ప్రతినిధులు పూర్తిగా భారత ప్రజానీకమును కంటికి జికిని ప్రతినిధులుగాలేరు. యావద్భారత ప్రజానీకమునకు వోటింగు హక్కులేదు. నూటికి 15 మంది మాత్రమే వోటర్లుగా ఉన్నారు. అట్టి వోటర్లచే ఎన్నుకోబడిన రాష్ట్రీయ శాసన సభలనుండి ప్రతినిధులు ఈ రాజ్యాంగ పరిషత్తుకు పంపబడిరి. కనుక ఇట్టి స్వల్ప ప్రాతినిధ్యముగల యీ పరిషత్తు యావద్భారతజాతికి వర్తించెడి రాజ్యాంగ విధానమును తయారుచేయుటకు తగినంత అర్హతకలది కాదు. ఈ రాజ్యాంగ విధానము అమెరికా, కెనడా మొదలగు రాజ్యాల రాజ్యాంగ చట్టముల అనుకరణగా తయారుచేయబడెను. భారతదేశములో ఉన్నటువంటి లక్షలకొలది గ్రామాలకు ఈ రాజ్యాంగ విధానములో ప్రసక్తి ప్రమేయము లేదు. రష్యారాజ్యములో విప్లవానంతరము ఏర్పడిన పరిస్థితుల వంటి పరిస్థితులే ఇప్పుడు మన దేశములో ఏర్పడెను. కనుక మనము రష్యను రాజ్యాంగ విధానమును అనుసరించవలెను. కేంద్రప్రభుత్వమును ఒక బలమైన అధికారసంస్థగా చేయవలెనను మాట నిజమే. అట్టి కేంద్రాధికార ప్రతిష్ఠాపన అందలి అంగభాగముల ఇష్టపడి చేసిన అధికార ప్రతిష్ఠాపనగానుండవలెను గాని, కేంద్రాధికారమును అంతర్భాగముల మీద అంటగట్టకూడదు. గాంధిమహాత్ముడు గ్రామాలనే ఆయువుపట్టుగా భావించి గ్రామ జీవితమువల్లనే ఆత్మప్రబోధమును పొందెను. కాని అట్టి గ్రామాల ప్రాధాన్యము యీ రాజ్యాంగ విధానములో నిర్లక్ష్యము చేయబడెను.

### పండిత బాలకృష్ణశర్మగారు

రాజ్యాంగవిధానమును తయారుచేయవలెనని సంకల్పంతో యీ పరిషత్తుకు సభ్యులుగా వచ్చినవారే యీ పరిషత్తుకు అట్టి రాజ్యాంగవిధాన నిర్ణయార్హత లేదనుట స్వవచన వ్యాఘాతముగా నుండును. కాంగ్రెసు మహాసభ ప్రజానీకము తరఫున మాట్లాడుటకు అధికారము కలదను చున్నారు. కాని, ప్రజానీకంలో నూటికి ఎంతమంది కాంగ్రెసువారలో నిర్ధారణగా తెలియుటలేదు. ఈ రాజ్యాంగవిధానమును నిందించుటలో గాంధి ప్రేమను పైకితీసుకొని వచ్చుచున్నారు.

గాంధీజీ ఎప్పుడునూ వ్యక్తి స్వాతంత్ర్యమే అన్నింటికన్న ఎక్కువ ముఖ్యమైన విషయముగా గ్రహించెను. ఒక కేంద్రప్రభుత్వ సేనను నేదికూడా అవసరమా అని ఆయన శంకించెను. ఆయన ఒకవిధమైన పారలౌకిక దృష్టిగల అరాజకవాది. ఈ రాజ్యాంగ విధానములో గ్రామ స్వపరిపాలనమునుకూడా వృద్ధిచేయుటకు అవకాశములు కలవు.

### శివన్లాలు సాక్సేనా

ఈ రాజ్యాంగ విధానచర్చను వాయిదా వేయవలెనను సవరణ తీర్మానమును నేను ప్రతిఘటిస్తున్నాను. సార్వజనిక వోటింగు పద్ధతిమీద రాజ్యాంగ పరిషత్సభ్యులు ఎన్నుకోబడినట్లయితే అట్టి పరిషత్తు ఇంతకంటె ఎక్కువగా ప్రజాప్రతినిధి సభ యనిపించుకొనును. ఈ రాజ్యాంగ చట్టం ప్రకారము క్రొత్త అసెంబ్లీ సభ అట్టి సార్వజనిక వోటింగు పద్ధతి ననుసరించి ఏర్పడగలదు. అట్టి క్రొత్త అసెంబ్లీలో ఈ రాజ్యాంగ చట్టమునకు అవసరమైన సవరణలు చేయవచ్చును. ఈ రాజ్యాంగ చట్టమునకు ఏవైన సవరణలు ఉత్తరోత్తర చేయుటకు కేంద్ర అసెంబ్లీ సభలో మూడింట రెండువంతుల వంది అంగీకరిస్తేనే అట్టి మార్పులు చేయవచ్చునని నిబంధన యీ రాజ్యాంగ చట్టములో గలదు. అవసరమైతే యీ నిబంధనను సంస్కరించవచ్చును. మూడింట రెండువంతులనే వరకు లేకుండగా అధిక సంఖ్యాకుల ఆమోదముతో సవరించవచ్చునని నిబంధన ఏర్పరచవచ్చును.

నాగప్పగారు: సార్వజనిక వోటింగు అమలులో నున్నప్పటికి ఇప్పుడు యీ పరిషత్తులో చేరియున్న సభ్యులే ప్రజాపరిషత్ప్రతినిధులుగా ఎన్నుకోబడగలరు, ఎందుకనగా, యీ ప్రతినిధులు దేశస్వాతంత్ర్యంకొరకు అనేక సంవత్సరాలుగా అష్టకష్టాలు అనుభవించారు.

శ్యామనందన సహాయగారు: సేట్ దామోదర స్వరూపుగారును మౌలానా హజరల్ మొహానీగారును ప్రతిపాదించిన సవరణతీర్మానాల చర్చను యింతటితో సమాప్తంచేయ కోరుచున్నాను.

ఈచర్చను సమాప్తంచేయవలెనని అధ్యక్షులు సంఖ్యాకులు అంగీకరించిరి. సవరణతీర్మానాలు ఓడిపోయెను. రాజ్యాంగవిధానపరిశీలనకు సభవారు పూనుకొనిరి.

## ధాన్యం ధర హెచ్చింపు ఆలోచన

### ధరలో బోనసు చేర్చెదరా?

చెన్నపట్నం, నవంబరు 5: రైతులకు సౌకర్యంగా ఉండేటందుకుగాను బోనసుగాఇస్తూఉండిన రు 2/- బస్తా ధరక్రింద ఇచ్చివేయడానికి మద్రాసు ప్రభుత్వం వారు సుముఖంగా ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది. ఇందువల్ల దాదాపు 4½ కోట్లు రైతులకు ముట్టగలవు. ఈ ధరను వాడుకదారులనుంచి వసూలు చేయుదురు. భారత ప్రభుత్వంవారు ధర హెచ్చించుటానికి మొదట అభ్యంతరం తెలిపినట్లును, దానిపై ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నట్లును తెలియుచున్నది. కలెక్టర్ల సభలో కూడా ఈయంశము చర్చింపబడునని కూడ తెలియుచున్నది.

## తుపానువల్ల వరిచేలకు నష్టము

కాకినాడ, నవంబరు 4: కాకినాడ తాలూకా నేమాం, కొమరగిరి, తమ్మవరం గ్రామాలు నవంబరు 1 సోమవారమురాత్రి 12 గంటలకు సముద్రపు పొంగువల్ల దెబ్బతిన్నవి. నేమాం గ్రామంలో 400 యకరముల భూమి ముంపువు నష్టము పొందినది. తమ్మవరం గ్రామంలో 15 యకరముల భూమి, కొమరగిరిలో 20 యకరముల భూమి కూడ ముంపుడు నష్టముపొందినవి. సముద్రపు పొంగులో పశువులు కొట్టుకు వచ్చినవి. ఇండ్లకు, మనుష్యులకు ప్రమాదము వాటిల్లలేదు.

### కృష్ణాజిల్లా

చోరసుపి, నవంబరు 4: గత సోమవారం ఉదయంనుండీ గాలి, వాన ప్రారంభమయినది. నిన్న సాయంత్రము గాలితగ్గి వర్షము కురియుచున్నది. వరిచేలుపంటసుంకు రాలిపోయి, నీటిలో పడిపోయినవి. యకి 1 కి షుమారు 5 బస్తాల ధాన్యము తక్కువ పండగలదని యిన్నట ఊహించుచున్నారు. నేటి ఉదయంకూడ వర్షము పడుచునేయున్నది.

## రంగాగారి జయంతి

శ్రీ ఎన్. జి. రంగాగారి 49-వ జన్మదినోత్సవము ఈ నెల 7-న అందరూ ఉత్సాహంతో జరుపాలని ఏలూరు తాలూకా కాంగ్రెస్, రైతుకాంగ్రెస్ సంఘముల అధ్యక్షులున్నూ, చిత్తూరు జిల్లా రైతుకాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిన్నీ ప్రకటనలు చేసిరి.

## ఉత్తర అట్లాంటిక్ రక్షణ

### త్వరలో ఒడంబడిక కుదిరే సూచన

న్యూయార్కు, నవంబరు 4: అమెరికా అధ్యక్షుడుగ ట్రూమన్ ఎన్నికగుటతో ఉత్తర అట్లాంటిక్ సైనిక ఒడంబడిక సంప్రతింపులు తిరిగి ప్రారంభమై, త్వరలోనే ఈ సమాఖ్య నిర్మాణం పూర్తి కావచ్చునని విజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. కాంగ్రెస్‌లో డెమోక్రాట్ పక్షానికి అవసరమైన సంఖ్యాబలం లభించినందున, ఈ ఒడంబడికకు సంబంధించిన శాసనకలాపం నిర్విఘ్నంగా సాగగలదని కూడా వీరు భావిస్తున్నారు.

ట్రూమన్ తిరిగీ అధ్యక్షుడుగా ఎన్నికఅవటంతో, అమెరికా కెనడాలకూ పశ్చిమయూరోపీయ సమాఖ్యకూ రక్షణ ఒడంబడిక అనుకున్న దానికన్న త్వరగా జరిగే అవకాశం ఏర్పడినది. అమెరికా విదేశాంగశాఖ నిపుణులు ఈ "ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక" ముసాయిదాను సాధ్యమైనంత త్వరగా తయారుచేసి వచ్చే సంవత్సరం ప్రారంభంలో కాంగ్రెసు సమావేశం కాగానే సభలో చర్చకు నివేదింతురని తెలియుచున్నది. ఎగువసభలోనూ, దిగువసభలోనూ కూడా ట్రూమన్‌కు అధిక సంఖ్యాబలం లభించినదికాబట్టి, రక్షణ ఒడంబడిక క్రిందనూ, మార్షల్ పథకం క్రిందనూ తానుకోరిన ధనం వెంటవెంటనే శాసనసభల కమిటీలచేత ట్రూమన్ మంజూరు చేయించుకోగలడు.

### ఒడంబడికతయారైనట్లు వార్త

లండన్, నవంబరు 5: పశ్చిమయూరపు సమాఖ్యలోని బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియం, లక్జెంబర్గు, హాలెండ్‌లతో అమెరికా, కెనడాలుకలిసి ఉత్తర అట్లాంటిక్ సంయుక్తరక్షణ ఒడంబడికను చేసుకొనప్రయత్నిస్తున్నవి. ఈ ఒడంబడిక ముసాయిదా అప్పుడే తయారయినదనీ, అది ఈ 7 దేశాలకూ పంపబడినదనీ పారిస్‌నుండి ఒకవార్త వచ్చినది.

## అమెరికను ప్రభుత్వవర్గపు మార్పులు:

న్యూయార్కు, నవంబరు 4: అమెరికా సంయుక్తరాష్ట్రముల విదేశాంగ కార్యదర్శి జార్జి మార్షలు, సైనికశాఖా కార్యదర్శి జేమ్సు ఫారెస్టాల్, స్వదేశాంగ కార్యదర్శి జూలియసు కర్గరు, వ్యాపార శాఖాకార్యదర్శి చార్లెస్ సాయరు, ఈ నలుగురు ప్రభుత్వవర్గములోనితమ పదవులకు రాజీనామా నిచ్చెదరు.

కొత్తగా తిరిగి ఎన్నుకోబడిన ట్రూమను తన అధికారపదవిని తిరిగి స్వీకరించుట జనవరి 20 తేదీని జరుగును. అప్పుడు పై చెప్పిన నలుగురు రాజీనామా నిచ్చెదరు.

నూతనప్రభుత్వ నిర్మాణమే ట్రూమన్ ముఖ్యంగా నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యం. 1948 వ సంవత్సరాంతానికి తాను ప్రభుత్వ బాధ్యతలనుండి పూర్తిగా విరమించుకో గోరుచున్నానని జార్జి మార్షల్, ఎన్నికలకు చాలారోజులు ముందుగానే ట్రూమన్‌కు విన్నవించుకొనెను.

విదేశాంగశాఖ సహాయ కార్యదర్శిగా ఉన్న రాబర్ట్ లొవెట్, రక్షణ శాఖ కార్యదర్శి జేమ్సు ఫారెస్టాల్ కూడ ఉద్యోగం చాలించుకోవలెనని కోరుచున్నారు.

## అధ్యక్షుని ఎన్నిక ఫలితాలు

తాజాగావచ్చిన ఎన్నిక ఫలితాలు ఈ విధంగా ఉన్నవి:-

ట్రూమన్:-2,25,42,039.

డ్యూయీ:- 2,07,8,212.

థర్మండ్:-9,10,857.

మొత్తం ప్రజలు వేసిన వోట్లు 4,52,40,986.

సెనేటులో డెమాక్రాట్లు 54 సీట్లు సంపాదించిరి. రిపబ్లికన్లకు 42 సీట్లు ఉన్నవి. దిగువసభలో డెమాక్రాట్లకు 261 స్థానములు లభించినవి. రిపబ్లికన్లకు 168 వచ్చినవి.

## ట్రూమన్‌కు "వాషింగ్టన్ పోస్టు" సూచన

వాషింగ్టన్, నవంబరు 4: ఎన్నికలలో ట్రూమన్ ఓడిపోతాడని జోస్యం చెప్పిన పత్రికా సంపాదకులను రాజకీయ పరిశీలకులను రేడియో వ్యాఖ్యాతలను విందుకు పిలిపించి, వారిచేత బూడిద రైతాగి దుస్తులు ధరింపజేసి ముసలికాకి సుంగి కాయలను ఆహారంగా వడ్డించవలెననీ, ట్రూమన్ తెల్లని దుస్తులలో వచ్చి వారి పరాభవాన్ని చూస్తూ టర్కీ మాంసం ఆరగించవలెనని కోరుతూ "వాషింగ్టన్ పోస్టు" ఇవాళ ట్రూమన్‌కు ఒక తంతివార్త పంపెను. ఈ సూచనను నిరాకరిస్తూ, ట్రూమన్ ఇలా అన్నాడు:

"జరగవలసిన దంతయేకో జరిగిపోయింది. ఇక ఎవరిమీద మనసులో నేను ఈసు పెట్టుకోను. ఓడిపోయినవారు ఓడిపోయినవారే అని ఎవరూ బాధపడు తూనే ఉంటారు. వారినింకా ఏడిపించవలసిన అవసరం."

# మదరాసు హైకోర్టు సెషన్సు

## ఫోర్జరీ మోసం కేసులో విడుదల

చెన్నపట్నం, నవంబరు 4 : 5. మణ వాళనాయుడు అనునతడు 12-1-18 వ తేదీని సివిల్ సప్లయిస్ అసిస్టెంటు కమిషనరు దొంగ సంతకములో పెయ్యిబస్తాల రవాణా కని నొక అనుమతిపత్రమును సృష్టించి వేరొక ఆర్. యం. మాణిక్యంచెట్టి అను నతనికి తానొక పర్మిటును తెచ్చి యిచ్చెదనని చెప్పి ఆయననుండి రూ. 85 పుచ్చుకొని మోసం చేసెనని తెబ్బిన కేసు యీ దినం మదరాసు హైకోర్టు సెషన్సులో న్యా. సుబ్బారావు గారియెదుట విచారణకు వచ్చెను. ముద్దాయి నిర్దోషియని జూరీ వారిచ్చినతీర్పుతో న్యాయమూర్తి ఏకీభవించి ముద్దాయిని విడుదల చేస్తూ తీర్పు నిచ్చిరి. ప్రభుత్వము తరపున అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు ముద్దాయి తరపున శ్రీ బి. టి. సుందర రాజన్ వాదించిరి.

### రెడ్‌హిల్సు చెరువు నీటిమట్టం

చెన్నపురి, నవంబర్ 4: నిన్న శ్రీ రెడ్‌హిల్స్ చెరువువద్ద 3 4 అంగుళాలు, చోళవరం తటాకంవద్ద 3 అంగుళాలు, తాంబరపాకం చెరువు ప్రాంతంలో 2½ అంగుళాల వానపడినందున రెడ్‌హిల్స్ చెరువు నీటిమట్టం అరఅడుగుయెక్కువైనది. ఈ యెక్కువనీరు నగరమునకు 15 రోజులకు సరిపోవును.

### ఆంధ్ర మహిళాసభ

చెన్నపట్నం, నవంబర్ 4: నిన్న సాయంత్రము శ్రీవిశ్వనాధుల యజ్ఞనారాయణశర్మ ఆంధ్ర మహిళా సభలో గీతగోవిందపారాయణచేసిరి.

### దీపావళి ఉత్సవం విందు

మదరాసులో పెద్దలు పలువురు సంఘంగాచేరి రాజాజీహాలులో 3 తే దీపావళి విందుజరిపిరి. గవర్నరు భవనగరు మహారాజాగారు అధ్యక్షతవహించి, యిట్టి ఉత్సవములు సాంఘిక సఖ్యత పెంపొందించుటకు తోడ్పడ గలవనియు, మదరాసు యూనివర్సిటీలో యితర రాష్ట్రములకు ఆదర్శంగానుండవలెననియు చెప్పిరి.

# కొల్హాపూరు ఆర్థిక స్థితిగురించి ప్రభుత్వ విచారణ

బొంబాయి, నవంబరు 3 కొల్హాపూరు పాలనాధికారి సంస్థాన పరిపాలన సాగుట కొరకు ఇండియా ప్రభుత్వమును రెండు కోట్ల రూపాయల అప్పు అడిగెను. పాలనాధికారి నియామకమునకు పూర్వము సంవత్సరకాలములో ఉండిన సంస్థాన ఆర్థిక పరిస్థితినిగురించి విచారించుటకు ఆర్థిక శాఖాధికారి సి. దయాల్ త్వరలో రానున్నాడు. పాలనాధికారి కోరిన రుణ మిచ్చుటకు ముందుగా ఇండియా ప్రభుత్వము విచారణా ఫలితములు తెలిసికొనగోరవచ్చును.

# నగరములో గత సంవత్సరపు ఆరోగ్యస్థితి

చెన్నపట్నములో 1947 సంవత్సరములో 40758 మంది జన్మించిరి—మరణములు 29979. వెయ్యికి 196 మంది శిశువులు, వెయ్యి ప్రసూతులకు 8-5 తల్లులు మరణించిరి. 85276 మంది విద్యార్థుల ఆరోగ్యము పరీక్షింపబడినది. 11,143 మంది విద్యార్థులకు చికిత్స చేయబడినది. ఇదిగాక 591 కుష్ఠు విద్యార్థులకు కూడా చికిత్స చేయబడినది.

నిరాశ్రయులకు, కార్పొరేషన్‌వారు కొన్ని సౌకర్యములను కల్పించిరి. నగరములో మొత్తము 24 శిశు సంరక్షణాలయములున్నవి. ట్రాడ్వేలో ఒక "కృషి" (పనిమీదపోవు తల్లులు తమ పిల్లల నుంచు చోటు) నిర్మింపబడినది. ఇదిగాక అశోక్ విహార్, ఏప్రిల్‌సపార్కులు కూడా నిర్మింపబడినవి. నగరములో క్రొత్తగా 2504 ఇళ్లలో ఫ్లష్‌ఔట్ మరుగుదొడ్లు కట్టబడినవి.

## విషాద మరణం

చెన్నపట్నం, నవంబర్ 4 : చాలా పొడవైన యినుపపట్టాలను 2 బండ్లలో ఒక టివెనుక నొకదానిలో నుంచి యీవాళ ఉదయం గిండిసమీపమున లాగుకొని పోతూ ఉండగా వంతెన దిగుడులో బండి లాగుచుండిన కృష్ణన్ అనువాడు ప్రమాదవశమున కాలుజారి బండిక్రిందపడి మరణించెను.

# మదరాసు కార్పొరేషన్ అవసరాలు

## క్రొత్తపన్ను, కోటపై అధికారం ఉండాలి

### పరిపాలనా నివేదికలోని సూచనలు

మదరాసు,నవంబరు 4 : "కార్పొరేషన్ తలపెట్టిన అనేక స్కీములకు ఆర్థికలోపమే ప్రతిబంధకంగా నుండి. పెట్టుబడిపెట్టే స్కీములకు మామూలు రాబడిచాలక ప్రభుత్వం వద్ద ఋణం చేయవలసివస్తున్నది. కార్పొరేషను తీర్చగలదను నమ్మకం ఉండి, తీర్చే సమర్థత ఉంటేనే, ప్రభుత్వం విరివిగా ఋణాలు యిచ్చును. లేకున్న ఋణం రాదు. పనులు సాగవు. కనుక నగరంలో ప్రయాణీకుల పన్ను వసూలు చేయుటకు అవకాశం యివ్వాలి," అని కమిషనరు సి. నరశింహంగారు 1947-48 పరిపాలనా నివేదికయందు తెలిపిరి.

కార్పొరేషను ఆదాయ వ్యయములు గూర్చి తెల్పుచు, 1946-47 లో 135 02 లక్షలున్న రాబడి 1947-48 లో 155.97 లక్షలకు పెరిగెను. వ్యయముకూడ 141.37 లనుండి 160.84 లక్షలకు పెరిగెను. అందు ఆస్తిపన్ను 65.47 ల నుండి 79 39 ల.లకు పెరిగెను. వసూళ్లు ప్రతియేడుకన్న యీయేడు అత్యధికంగా జరిగెను. అనేక సదుపాయాలు ప్రజలకు చేయుటకు కట్టడములు కట్టుటచేతను, సిబ్బందికి కరువుభత్యాలు పెంచుటచేతను ఖర్చులురాబడిని మించిపోయినవి. జనసంఖ్య హెచ్చుటచేతను, బయటవారనేకులువచ్చి నివాసముండుటచేతను, విశేష చేరువప్రదేశము కార్పొరేషను పరిహద్దులలో చేర్చబడి, అందు అభివృద్ధి కార్యాలనేకం చేయవలసి యుండుటచేతను, ఖర్చెక్కువయింది. దానికి తగినట్లు రాబడికూడ పెరగాలి. ఆస్తిపన్ను లు పెంచుటకు కమిషనరు చేసినసూచన కౌన్సిలు ఆలోచనలో నుంది.

"ప్రయాణీకుల పన్నువిధించుటకు అనుమతించి, ఫోర్టు సెంటు జార్జి కార్పొరేషను పరిహద్దులలో చేర్చి పన్నులకు లోబరచి, వినోదముల పన్నంతా కార్పొరేషనుకే విడచి, ప్రభుత్వంవారు వశం చేసుకొన్న ప్రజోపయుక్త మగు బస్సుసర్వీసులు మున్నగువాటి రాబడి అంతా కార్పొరేషను వారికి విడచిన తప్ప కార్పొరేషను ఆర్థిక స్థితి బాగుపడదు. ప్రాథమిక విద్య బాగుగ వ్యాపించినది. బాలుర దేహపరిశ్రమకు ఎక్కువ శ్రద్ధ వహించబడినది. క్రొత్తగ చేరిన ప్రాంతాలకు నీటి సరఫరా ఏర్పాటుల గూర్చి ఆలోచించుచున్నారు. షినాయి నగరులో మధ్య గరగతి ప్రజలకు 84 ఇండ్లు 1947-48 సం॥ లో నిర్మించబడినవి. కార్మికులకు మొత్తం 1987 యిండ్లు కట్టబడియున్నవి. ఇంకను 8000 కట్టాలి. అని తెలిపి కమిషనరు కౌన్సిలువారు తనకు చేసిన సహాయమునకు కృతజ్ఞత తెలిపిరి.

నగరంలో యిండ్లు చాలక ప్రజలు చాల యిక్కట్టులకు లోనగుచున్నారు. ఇండ్ల సదుపాయం ఎక్కువ చేయుటకు అందరి పాటు బనకుండినచో ప్రజల ఆరోగ్యం కూడా చెడవచ్చునని, కమిషనరుగారు తమ నివేదిక యందు హెచ్చరించిరి.

### విద్యామంత్రి సంచారం

విద్యాశాఖమంత్రి టి. ఎస్. అవనాశలింగం చెట్టిగారు 12 వ తేది రాత్రి మదరాసు విడచి 13 న ఏలూరు, 14 న తాడేపల్లిగూడెం, పెంటపాడు, భీమవరం, నిడదవోలు, చూచుకొని, రాత్రి కాకినాడ చేరి 15 తేది కాకినాడలో మునిసిపలు బాలికాపాఠశాల శంకుస్థాపన జరిపి, 16 తేది మదరాసు వత్తురు.

## దత్తమండలాలలో బిజపూరు పద్ధతి

### గట్లుకట్టి సాగుచేయించుటకు ప్రభుత్వ చట్టం

మదరాసు, నవంబరు 4: భూముల సాగు అభివృద్ధికై "కాంటూరు బండింగు" చట్టమును శాసనసభలో ప్రవేశపెట్టవలచి, చిత్తుచట్టమును యీవారం గజెటులో ప్రకటించిరి. చట్టముయొక్క కారణోద్దేశములందు యిట్లు ప్రకటింపబడినది·

దత్తమండలాలలో ప్రతియేడు కరువు నివారణ పనులకై విశేష ధనం వెచ్చించుటయు, అందువల్ల స్థిరమయిన లాభమేదియు లేకుండుటయు బాగుతేదు గాన, బొంబాయి రాష్ట్రంలో బిజపూరుజిల్లాయందు వలె గట్లుకట్టే స్కీము అనుసరించి మెరక పంటలు పండించుట ఉపయుక్తముగ నుండునని 1943 సెప్టెంబరులో ఇండియా ప్రభుత్వం వ్యవసాయోత్పత్తిశాఖ డైరక్టరు సూచించి యుండెను. ఆ సూచన ననుసరించి ఒక జిల్లా వ్యవసాయాధికారిని, ఒక ఎగ్జిక్యూటివు ఇంజనీరుని బిజపూరు జిల్లాకు పంపి, అక్కడి పద్ధతి పరిశీలించి రమ్మనిరి. వారు పంపిన నివేదికలను చూచి, రివెన్యూ బోర్డువారితో సంప్రదించిన పిమ్మట, యీ రాష్ట్రంలో గూడ కాంటూరు బండింగును ప్రవేశింప (అనగా, పటి తీరుగా ! పేరకు గట్లుకట్టి, పెరకలు పల్లంగా మార్చి గోతులు త్రవ్వి నీరు నిలవచేసే పద్ధతి) యీ రాష్ట్రమునందు కూడ కొన్ని తావులందు అమలు జరపాలని ప్రభుత్వంవారు నిశ్చయించిరి. అందుకై యీ చట్టం చేయుచున్నారు. ఈ చట్టం ప్రకారం, యీ పద్ధతి అనుసరించే చోట్ల భూస్వాములు సదరు ఖర్చులు పూర్తిగా కాని కొంతభాగంగాని భరించాలి. చట్టం బొంబాయి భూముల అభివృద్ధి చట్టం (1942) అనుసరించి యున్నది.

## విద్యుచ్ఛక్తి వ్యాప్తి

మదరాసు ప్రభుత్వ విద్యుచ్ఛక్తిశాఖ వారు 1947-48 లో రాష్ట్రమునందు 146 గ్రామాలకు క్రొత్తగ విద్యుచ్ఛక్తి సరఫరా చేసే ఏర్పాట్లు చేసిరి. అందు రయితులకు పొలాలకు నీటిసరఫరా స్కీములకు ముందుగా నిత్తురు, ప్రత్యేకంగా అభివృద్ధికై ఎంచబడిన ఫిర్కాలకు త్వరగ యిత్తురు. 1948-49 సం॥ నందు మాచిఖండు హైడ్రో ఎలక్ట్రికు స్కీము వశపరచుకొనుట, బెజవాడ, రాజమండ్రి, సామర్లకోట స్కీము పొడిగించుట, మదరాసు-మెట్టూరు స్కీములు కలుపుట, జరుగును. అని పరిపాలనా నివేదికయందు తెలుపబడెను.

### ఆస్ట్రేలియా జొన్నలు

ఆస్ట్రేలియా జొన్నలు 1000 టన్నులు గత 29 తేదీన కొచిను రేవులో దిగినవి. ఈ సరకంతా చన్న రాష్ట్రానికే 250 టన్నుల రవ్వ తిరువాంకూరు కొరకు కొచిను రేవులో దిగెను

ఆస్ట్రేలియా రవ్వ యిపుడు పౌను 0-14-0 చొ॥ న విక్రయించుచున్నారు. ప్రభుత్వంవారు 7 తేదీ నుండి దీని కంట్రోలు ధర 0-7-0 గ నిర్ణయించిరి.

చీనాకు మదరాసునుండి దినమునకు ఒకొక్కరు చెరి రూ 30 మాత్రం మనియార్డరు చేయవచ్చని పోస్టు అధికారులు ప్రకటించిరి.

## డా॥ పట్టాభిగారికి అభినందనలు

మదరాసు డిప్రెస్డు క్లాసు లీసు వారు క. శ్రీరాములుగారి అధ్యక్షతను 3 తే సభచేసి, కాంగ్రెసు అధ్యక్షునిగ ఎన్నుకొనబడిన డా॥ పట్టాభి సీతారామయ్యగారిని అభినందించుచు తీర్మానించిరి

మదరాసు ప్రభుత్వంవారు మద్య నిషేధం అమలుజరిపినందుకు అభినందించుచు, అందువల్ల పనిపోయినవారికి వెంటనే పను లు కల్పింపకోరుచు తీర్మానించిరి.

## చెరుకువాడవారి సన్మాన నిధి

చెన్నపట్నం, నవంబరు 3. శ్రీ చెరుకువాడ నరసింహంగారి సన్మాననిధికి ఈ 2 వ తేదీ వరకు యీ క్రింది మొత్తములు చేరినవని కోశాధిపతి తెలుపుచున్నారు :

శ్రీయుతులు యెర్నేని లక్ష్మీనారాయణ బెజవాడ 216, పర్వతనేని బ్రహ్మయ్య మదరాసు 116, అడుసుమల్లి వెంకటసుబ్బారావు గుడ్లవల్లేరు 100, అడుసుమిల్లి అశ్వద్ధనారాయణమూర్తి 100, సరస్వతీ టాకీసు లిమిటెడ్, బెజవాడ 25, మెర్ల సత్యనారాయణ రేలంగి 25, గొట్టిపాటి వెంకటసుబ్బయ్య ఘంటసాల 20, మ. వెంకటకృష్ణ రాజమహేంద్రవరము 15, ఉప్పుటూరి వెంకటపున్నయ్య గుంటూరు 11, పిన్నమనేని వీరయ్య కురుమద్దాలి 10, చెలసాని నాగభూషణం అంగలూరు 10, మూర్తి రామయ్య కొండిపర్రు 10-0-0 ప్రజాభిమాని, మదరాసు 5.

మొత్తం రు. 663-0-0.

లోగడ ప్రకటించిన మొత్తము రు. 2,592-0-0.

రు. 3,255-0-0.

# మదరాసు రేడియో

## నవంబరు 7 ఆదివారం

మదరాసు (2)

7-0 గం. స్వాగతం 7-10 తెలుగులో వార్తలు. 7-20 చిత్తూరు సుబ్రహ్మణ్యయ్యరు 7-30 టాకీ రికార్డులు. 8-0 ఇం. వార్తలు. 8-15 టాకీ రికార్డులు. 8-30 పాపా పులర్ 9-0 ఇ. వాయిద్యం, 9-10 మళయాళ నాటకం 1-0 టి. వి. వసంతపాట. 1-30 ఇ. వార్తలు. 1-40 శ్రోతలుకోరిన రికార్డులు, 2-5 తెలుగులో వార్తలు. 2-15 ఆటవికుపిల్లల కార్యక్రమం. 3-0 డి. కె. జయరాం, పాట. 4-0 టాకీ రికార్డులు. 4-30 ఇ. వాయిద్యం 5-30 నెదనూరు కృష్ణమూర్తి పాట. 6-0 ఇ. వార్తలు. 6-30 గ్రామస్తుల కార్యక్రమం. భక్త మయూరధ్వజ హరికథ డి. దానయ్య భాగవతారు 7-15 తెలుగులో వార్తలు. 7-30 వార్తావి. 7-45 టి. ఎస్. విజయలక్ష్మి పాట. 8-30 వి. కేశవమూర్తి ఫిడేలు. 9-0 ఇ వార్తలు. 9-40 అరికేరి నారాయణరావు పాట. 10-10 ఫిల్మ్ రికార్డులు.






Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G T. Madras.